య్యానఁగనుమూసి కన్దెఱచునంతటిలో మునిసీమఁ జేరఁగన్. 58

క. అరుగఁ దదీయమనస్స్ఫుర, దరవింద మరందబృందమై మధురసుధా
చిరకంపమై యొకానొక, పరమానందంబు హృదయబంధం బొందన్. 59

సీ. మధ్యసంధ్యాస్నాన మానీంద్రలూన తాపసగంధపవనంబు భ్రమరివాఱె
నంబుపన్నసమిత్కుశాయాతవటుజాత సమదనాదంబు మీసంబు దీఁటె
సవన ధూమాబ్దవీక్షణనటత్కేకికాంతావిలాసము తోడల్లుట్టుకొనియె
నన్యోన్యవైరాసహమృగేంద్రమత్తవేదండ కేళికలు పంతములు వలికె
నీకరణిమున్నగాఁ బరాకిడియె మౌని, యాశ్రమంబని తన్మార్గమభినుతింప
మోదమునఁ దేలి నృపమౌళి మోము చూడఁ, జనవుమైఁ జేరి నిజకేళిసచివుఁడనియె.

సీ. చలువలు నించు నచ్చపుమంచుఁ జిలికించు శీరాయఁ జెడ లేర్పఱించువాఁడు
గలభి గాదండ వేల్పుల నొక్కనొక్కనిఁగా ధనరాజు వెలినుండి యనుపువాఁడు
వారివారిప్రభుత్వతారతమ్యమెఱింగి గిరిశుండు బంతిసాగించువాఁడు
ప్రొద్దుపోయెను జూచి భుజియింపుఁ డని దేవపతి యుపచారము ల్పలుకువాఁడు
తగినవారల వీక్షించి తమ్మిచోఁటి ప్రోఁడు మాటికిఁ జవు లెచ్చరించువాఁడు
జనవరాఖండలా యిందు సంయమీంద్ర కాండకృతమైనసత్రయాగంబులందు. 61

చ. మునివనిత ల్శచీముఖ తమోనిభవేణులకుం బతివ్రతా
జనతతిఁ దెల్పఁజొచ్చెఁబరవిచారము గాదని వేల్పుటొజ్జజ
వ్వని మొగ మడ్డముంజొనుప వారలు నవ్వుదు రామె సిగ్గుపెం
పునఁ దలవంపఁ జందురుఁడు పొంగగ నిచ్చట యాగవేళలన్. 62

సీ. సాలీఁడు గాఁబోలు సమదవేదండంబు తెలినారచీరలుడులిచి తెచ్చుఁ
బనివాఁడు గాఁబోలుఁ బటుఘోణిపోతంబు బలుమోర నివ్వరి కలుపుదీయు
గొల్లఁడు గాఁబోలు భల్లూకపాకంబు మేలిజున్నుఁబసిమేఁపి తెచ్చుఁ
జనవరి గాఁబోలు గొనబుఁబ్రాయపు జింక యలరిపై పారుపత్యంబు సేయుఁ
గూలిగొను నొజ్జకాఁబోలుఁ గోదమ చిలుక, తపసిబుడుతలగమికి వేదంబు నుడువు
సుసరముగఁ బారికాంక్షు లేజోలిలేక, జపతపంబులు సాగింప జనవరేణ్య. 63

చ. మునివరులేగ వెంట మృగము ల్నదికిం జని యంతనంత మే
పున కటు నిల్చుచున్ని యమపూర్ణత వారు నిజాశ్రమాళికిం
జనినఁ దదార్ద్రబంధురవిశాలజటల్దరజీవకాంత వె
న్కొని చెవి బక్కరించి యొఱువఁ బొదకట్టినవెల్ల దాఁటుచున్. 64

ఉ. ఎంతదినంబులుం బడగ లించుక నీడఁగఁ బట్టి మానులం
గొండొక సేపదేర్చు ఫణిఘోటులఁ జేరి యిదేటి కార్యమా
లెండు మహీమి మే మిచటలేమె యటంచు మరల్చి చెల్వమై
నిండ మయూరికల్ పికిలినిద్దపు ఱెక్కలవీచు నక్కడన్. 65

మహాస్రగ్ధర. జనవన్మౌనీంద్రవేదాక్షరయుత తతహస్తస్రువాజ్యాహుతిప్రో
ద్భవవహ్నిస్ఫారకీలాప్రకటితకరదీపప్రభ న్వత్తు రౌరా
హవిర్గ్రాహాహూతు లింద్రాద్యమరు లననికై యాస ప్రేరేపఁగా మిఁ
దినపాంచద్భ్రమధూమస్థితులు నిబిడమై దృష్టి చీఁకట్లు గప్పన్. 66

క. వేలిమియగ్గి పొగల్దగు, వేలుపుడిగ్గియము సంగి వెలువడు నమరీ
జాలము తిన్నని పెన్నెఱి, వాలుఁగురుల కగరుధూపవైఖరి యగుచున్. 67

చ. ఇనహరిణాంకరశ్మి కెడమీయని యవ్వనిఁ బంకజాకరం
బునఁ గవఁజక్కవ ల్వగవఁ బొద్దులు గ్రుంకుట దెల్లవాఱుట
ల్గనమి జలాగవష్టి కులకాంతలమోమును కల్వరాయనిం
గనుఁగొని విచ్చిపోవుటయె గాని వియోగ మెఱుంగఁ దెన్నఁడున్. 68

చ. అని తెలుప న్మహీశుఁ డవుఁగా యని మెచ్చి పటాని తేజిడి
గ్గినతఱి మూఁగి గచ్చు టరిగె తైలిపానడ వైచి యచ్చపుం
బని మగజాతి చెక్కడపుఁ బానలు నిల్పిన వారలం గనుం
గొని యటు నిల్పి యాప్తులొకకొందఱు వెంటనెరా ముపంబునన్. 69

క. చని నృపతి గనియె మునిజన, వనితాజనతానితాంతవర్ధితకేళీ
వనపాళీ కుసుమాళీ, జనితాళీనలినఘనము సంయమివనమున్. 70

క. కని పర్ణశాలద్వారముఁ, జని యచ్చటివారి చెంత సంయమిపతికిం
దనరాక తెలియఁ జేసి త, దనుమతిచే వేగఁ జని తదంతర సీమన్- 71

సీ. అచ్ఛదంతచ్ఛవి యామస్తకన్యస్త భసితాభఁ జేరి కేకిసలు గొట్టి
మోఘావిరుచి గండమిలదుడుశ్మశ్రుకుక్ష్యయములఁ జప్పట్లు దఱచి నవ్వ
జడలఁ బర్విన డాలు శాతోదధారాళి కాంతులఁ గికురించి కన్ను మూయఁ
బటునఖమ్యాతి కరస్ఫటికాక్షమాలికా చ్ఛాయల డాసి కేకేయనంగ
నవ్యశార్దూలచర్మాసనంబుమీఁద, యోగపట్టె బిగించి కూర్చున్నవాని
గాలవుని గాంచి చేమున్న కట్టె మంత్రి, యంతికోనఁ జేరి సాష్టాంగమాచరించి- 72

క. నిలిచినఁ గనుఁగొని నరవరు, కులపావన యిందువచ్చు కూర్పుం దెవనా

నిలిపితివి తండ్రిపద్దులు, వెలసితి విటు లతనికన్న విక్రమ గరిమన్- 73

ఉ. అనుచు బహూకరించుసమయంబున నూరకయుండి యుండి యం
జనరుచి పుంజమంజిమకచగ్రహమైనతమంబు పర్వె తో
డన హరిచందనప్రతిభటంబగు వెన్నెల దోఁచె వెంటనే
కనఁబడియె న్నిరస్తకనకస్తబకస్తుతు లైన యెండలున్- 74

క. అది చూచి మేదినీవర, భిదురీ మృదురీతిగా దభేద్యము గంటే
యిదిసుమ్మ దనుజశాంబరి, గదిసె న్సరిపూర్తి దీని ఖండింపు మికన్- 75

గీ. విజయ మగు నీకుఁ గెలువు మో వీరవర్య
యనుచు గాలవుఁ డాడుచో నచటఁ గలుగు
పారిగాంక్షులు కటకటం బడుచు శిష్యు
లంటి చనుదేర నచ్చోటి కరుగుదెంచి- 76

క. మునిచంద్ర వచ్చి మావెం, టనెవచ్చు నటంటి వీతఁడా నృపుడేమ
య్యా నరేంద్ర కన్నులారం, గనుఁగొంటివె వీని యవదగాకి తనంబుల్- 77

ఉ. అయ్యయొ మాకు దంపమిడినంతిఫలంబు నరేంద్రచంద్ర యీ
దయ్యము తోడి జాగరము దాఁటఁగఁ జేసి శుభమ్ము లిమ్ము తే
వయ్య కొమాళ్ళతండ్రి వయి యాశ్రితరక్షణ దుష్టశిక్షణా
క్షయ్యదయాపరాక్రమ విశాలుఁడవై మనుమయ్య యిమ్మహిన్- 78

సీ. చనువుకొన్నామంచు జట చెప్పుచుఁ బరీక్షఁగొని వరింపు మటంచుఁ బెనఁగువారు
ననుజూచె ననుజూచె ననుచు రిత్తకురిత్త జడలు వట్టుక పోరఁ దొడఁగువారు
బులకము ల్మైనిట్టపొడువంగ వడి నోరు దెఱచి మైమైఁ జూడఁ దిరుగువారు
జేసన్న నటజంబు చెంతకు రమ్మని మును దొంగమొక్కులు మొక్కువారు
నగుదురీయయ్యలెల్ల వాఁ డపరుగడగ, గులుకుగుబ్బలు దళుకుఁ జెక్కులు మిటారి
మొలకనవ్వులు గలమోము ముద్దుగులుక, మాయపుం డెక్కులాడి నై డాయునపుడు-

సీ. అటుమొన్న భార్గవజటికి శౌనకమౌని కొకవాదుమై నొంటకుండఁ జేసె
మొన్నఁ బారాశర్యముని యోటరాఁ గూఁతలెగయించి వెరవేఁకి యెత్తఁ జేసె
నిన్న విశ్వామిత్రునికిఁ దంపరఘటించి యొడలెఱుంగక పడియుండఁ జేసె
నేఁడు మార్కండేయునికి సిపంబెత్తించి తలవీడఁగ బయళ్ళ మెలఁగఁ జేసె
మానవాధీశ విను మింతమాత్రమైన బ్రతుకవచ్చును వీనిచేఁ బడినపాట్ల
కొల్లఁబాటయ్యె మాకునిందునికి యేమి, చెప్పెడిది మాతపంబు నీచేతి దింక- 80

చ. అన విని యంతయేమిటికి నానతి యిచ్చెద రిన్నినాళ్ళుఁ ద
ద్దనుజుని నొంచి మీపద ముదారముదాకృతి నొందఁ జేయఁగం
టినయది నాకు నేర మవునేకద యాకొదవ ల్సహించిన
న్ననుపుఁడు వానిఁబట్టి నుఱుమాడెద నొద్దికఁ జెల్లఁజేసెదన్- 81

చ. అనిన రిపుక్షయోస్తు విజయోస్తు పతేభవతే యటంచు వా
రనుప దురాపకోప తరుణార్కవిభాదళితారుణాంబుజా
బనఁగను మోము కెంపుగఁ దదర్థరణోన్ముఖభృంగయుగ్మప
జ్జ్యానటనభ్రూకుటిక్రమము దెల్పఁగ నవ్వేటుఁ దర్లి నిల్చినన్- 82

సీ. అధిపభృత్య పరస్పరాన్వేషణాకారణప్రతివక్తృతన్నామకార్య
మననుగతస్వామి హయవేగభూరుహచ్ఛాయాసమాశ్రితచ్ఛాత్రకంబు
ధావనాయాసాస్వజీవనవృత్తిధిగ్వాదకాందోళికావహజనంబు
సమ్మర్దబహుళశాది సరణిక్షోభయపార్శ్వచారితవారణాధోరణంబు
సరయ సరదుష్ట్రనిష్ప్రతజ్జరత్తధూర్త, గణ్యాగాణిక్యసంభవత్కమనహాస్య
వారణక్షమతత్సుతాక్రూరదృష్టి, సంవృతాశంబు సైన్య మచ్చటికి వచ్చె- 83

క. ఈరీతి సైన్యమంతయుఁ, జేరిన నొకబయట రాజసింహము భటులం
దేరిజ వేయంబనిచి గు, డారము లెత్తించి యంతట ప్రవిగ్రింకన్- 84

గీ. పఱుపుటంగడి వీధులేర్పఱచి కొంచె, పాటి నడగని నెక్కి యాపాలె మెల్ల
విడియ నియమించి తిరిగె వేవేలు దివ్వ, టీలవెలుఁగున సంగీతమేలమమర- 85

చ. తిరిగి యతండు వచ్చి వడఁదేర్చుచు ఘుమ్మను వట్టివేళ్ళచ
ప్పరము కురంగటం దగు తుషారము చేరువఁ జారువజ్రపాం
డరరుచిగ్రమ్మ గుమ్మెతగుడారమునం గొలువుండి పట్టనాం
తరముననుండి వచ్చునరనాథులకమ్మలు వించు నున్నెడన్- 86

గీ. ఊడిగపుటత్తికాఁ డొక్కఁ డొఱుఁగుఁ జేరి
విభుని చెవిలోన నేమేమొ విన్నవింప
నతని కనుసన్న గనుఁగొని యయ్య మంచి
వతనిఁ బిలిపించెద నటంచు నఱిగివాఁడు. 87

సీ. నేసమై సగము దీసిన బూడెపండుతోఁ గూడినబంగారు లాడె సింగి
బారసీలిపిని జొప్పడ భగవద్గీత లెన్నిక వ్రాసిన చిన్నిపలక
బుడుత పసిమిరుచి పులితోలు చుట్టుతో బనసిక ల్లించిన పట్టుజోలె

యొకత్రిత్తి బరదేశుల కొసంగఁ గూర్చిన రసవాదపు మెఱుంగుఁ బసిఁడి బుడ్లు
కొండవలె నెత్తిపైఁ జుట్టుకొన్న జడలు, వెండికట్టులబెత్తంబు విడెముమీఁద
పిడియముగల్గుదార పాతలాఁడెజోగి, బిలికొని వచ్చి పొడఁగనిపించుటయును.

గీ. పతికరముఁజూప రత్నకంబళము మీఁదఁ, గడవసమునైచి కూర్చుండి బుడుతవీచు
సురటిగాడ్పుల నుదుటి కస్తూరి బొట్టు, రవలు రాలంగ నాతఁడా రాజుఁజూచి-

సీ. ఇది చేత నుండిన నిసుమంతవడిలోన నేదేశమునకైన నేగవచ్చు
నిది మోళి పైనున్న నెదుటి చేవెళ్ళిన వైరికైదువజాఱె దారితప్పు
నిది దట్టిపాఱు నున్న నెటువంటిరూపైనఁ బూరిపించి వేడుకఁ జూపవచ్చు

* * * * *

* * * * *

* * బడనికలొసంగి యొకమాయ పన్నుటయును.

ఉ. కంటెఁ బసిల్చినట్టికొన గల్గిన చంపురుఁగావి జాళువా
జంట పయంటపై నిగుడి చక్కని జక్కవ నిక్క చొక్కపుం
జంట చెలంగు బంగరువు చాయలు దూచియనంగఁ జాలు వా
ల్గంటి మెఱుంగుఁ జూపులు దళారనవచ్చె మహాద్భుతంబుగన్- 91

ఉ. చొక్కపుఁ బంజుకమ్మల రుచుల్మెఱుఁ గెక్కిన చెక్కుజాలువా
నక్కులచక్కుజక్కిణిగొనం బిగిగుబ్బలు పిక్కటిల్లఁగాఁ
జుక్కలరాచడాలు తెలిచూపులు త్రొక్కనిచోట్లు ద్రిక్కనా
చక్కెరబొమ్మయమ్మహిపచంద్రుని చక్కటికేగి గ్రక్కునన్- 92

ఉ. రంగు చెలంగ గుబ్బల ధరాస్థలివక్షము మోపలేమిసా
ష్టాంగ మొనర్ప సిగ్గువడె నంచు నభంగురపాకభిన్మణీ
సంగతకంకణారవముచాటఁగఁ బైటచెఱంగు కేలితో
ముంగలఁ గొంకుచుం గొలువుమొక్కుఘటించి పిఱింది కేగినన్- 93

సీ. సయిదోడ చూడు నస్నాయ యిల్లేజ యిల్లేశవోజులపతి యింగిలయ్య
* జగ్గుమంటివి వచ్చిశాణ నిద్దాహుంత్త కారి బుర్నాపుత్త గాలిసుమ్మ
అట్టెచూస్తుండది యదెనన్నె మోసిలి గలవాఁడ నని యదిగాక గడిని
చిక్కారిసాదన జేసెనదియింన్న దోభాజలల్ల మెలుద్రిబజారి

---

* యీపద్యమును బ్రత్యంతరములేకపోవుటచే నిచ్చవచ్చినట్లు దిద్దినఁగవిహృదయము చెడునని భీతిచేనాభారముఁ జదువరులకే వదలినాము.

దీనిపైయేఁచుఁడు సేసి నానువాని, చిక్కటారికొలారికచిస్తిరోలి
రాజుపాలానవిను యిటురాయటంచు, రాచదేవళ్ళ కెరలి విరాళిఁగొనిరి. 94
గీ. అంత వారెల్లఁ బద్మాకరణాభినూత, నాతివాచాటతాజ్యప్రభూతరోష
వీతిహోత్రసముజ్జాతధూతికీలి, కాత్రుతిస్ఫీతతామ్రాక్షులగుచు లేచి- 95
సీ. ఒఱలతోడుత పట్టిపారల వంకులు దుస్సి తెలిచల్లడములతో నిలుచువారు
నింటి కిమ్మని పిల్లబంటుచేతికి సొమ్ము లొసఁగి వీరావేశమొందువారు
జానన్నఁ జేవెళ్ళ మని హెచ్చరించుచుఁ జికటారి పొదలికి త్సేయువారు
దీని ముందరనొంచి వానిపైఁ బడువారు * * *
వాలు గొని లేచివచ్చు భూపాలుఁ ద్రోచి
యవ్వలి గుడారమున కేగుఁడనుచుఁ జెనకి
యతనిగద్దింపులకు భయమందువారు
నగుచు నంపఱు దొమ్మిగా నరయుటయును. 96
గీ. అంత నాలాడెజోగి మాయావిధిజ్ఞ, పంచమంతయు నుపసంహరించి నిలిచి
మునుపుఁ గొలువున్నవేళ నేయునికినుండి, రట్లయుండఁగఁ గైవార మాచరించి- 97
క. పాతాళకేతుఁ డంపిన, దూతన్నాసామి కెదిరి దురమున నిలువ
న్నీతరముగాదు వినునీ, వే తెంచి బలంబుతోడ నిటు విడియుటయున్- 98
మ. తనచారుల్గని వచ్చి సైన్యమున నేతద్వార్త విన్పింపఁగా
విని మీసంబులుదిద్ది దైత్యుఁ డహహా వీరా వడిన్వచ్చి పో
రనునన్నుం గది యించువారు మఱివారా నన్ను మార్కొంచురం
చనుమానింపకవచ్చి నిల్వఁగల వీరాగ్రేసరు ల్బాపురే! 99
క. పెంపు విచారింపక విని, పింపఁగరాచనక వచ్చి ప్రేలెడు వీరిం
జెంపలు వేయరె యనుచు ని, లింపారి నిజాప్తులం బిలిచి యిట్లనియెన్- 100
ఉ. వింటిరె యొక్కవార్త మనవెఱ్ఱులు చెప్పిరి తాముకన్నులం
గంటి మటంచు నీతబిసిగాండ్రు మదీయమహోగ్రమాయకై
దంటతనంబునంజని ఋతధ్వజు సైన్యసమేతుఁ జేర నా
బంటుఁ దనంబుఁ బాపుటకుఁ బన్నినవాఁ డఁట వాఁడు వాఁడిమిన్- 101
సీ. గరళకంఠద్వేషి కరకకాయలు గొన్ని తినియైన నాఁకలి దెచ్చుకొనుమ
దేవేంద్రమదభేది తెలిచాయ గల కోర పంటిమొన ల్బానఁ బట్టుకొమ్ము

ధూమ్రము బర్బరకేశ తుప్పువట్టినఘోరజిహ్వ మిక్కిలివాఁడి చేసికొమ్మ
కుటిలాక్ష మాంసంబు గొంతునఁ బడినోరు తెఱవ విప్పుడు సిగ్గు దెచ్చుకొమ్మ
తపవులకుఁ గల్గె మనుజయూథప్రచండ, పలలపారణ తద్రక్తపానకేళి
లాలసామోద మీసుమాళంబు మీఁద, నరుసరంపలు గంతులువైవుఁ డింక 102

క. అని నన్నుఁ బనుప వచ్చితి, మనుజేశ్వర చాయవెట్టుమా రాజుల ని
వ్వాని తూర్పుదెసను మాదొర, చనుదెంచు న్యోన్యసహాన సన్నాహనమునన్- 104

గీ. అనినఁ జెలునవ్వు నవ్వి యజ్జనవరాగ్ర, గణ్యుఁ డతనికిఁ గట్టునద్దం బొసంగి
మంచిపటునలె నేనడిపించు కొంప, మంచు వీడ్కొల్ప నాహైత్యుఁ డరుగుటయును-

గీ. అధిపతియుఁ జల్వలుధరించి యారగించి, హితజనులు గొల్వఁ దగువారి యిండ్లకెల్ల
గేలిగలిసేగి యిది వేళ కీతిఱమాట, వాసులకటంచు లాలించి వచ్చెనంత- 105

సీ. బొంగులు నిల్పియుబ్బునఁ బైఁడిబ్రాఁత బొమ్మలగుడారంబు లమర్చువారుఁ
గొయ్యలు నాఁటి యాకులతోడి రెమ్మలు వాటంపు గుడిసెలు నేయువారుఁ
బొక్కళ్ళవలెఁ గుంతములు చెక్కి యామీఁద గడితంపుఁ బచ్చడాల్గప్పువారుఁ
బచ్చికల్చెక్కుడుపాఱలఁ జెక్కి పూఁబొదరిండ్ల మున్నుగాఁ గదియువారు
నచ్చుపాగ నీటికంనువలరయువారుఁ, బురుఁగుఁబుట్టలు చెదర నుబ్బుచునునొక్క
పరిగ నవ్వుదుఁ జప్పట్లు చఱచువారు, నైరి తద్వేళఁ బాళెంబువారలెల్ల- 107

సీ. రాతిరి పొక్కళ్ళ రాలుకొల్పిన వహ్నిగలిగినపొగలు చీఁకట్లు గప్పె
గాశ్పులచే నూఁదకయ బగ్గుమను శిఖుల్నిగుడుచోటులు పట్టపగలుచేసెఁ
దగవార్చి మూకళ్ళ దిగువాఱునంచిన కూటిబల్తావు లాగుబ్బుకొనియెఁ
బొరలించి చంద్రనిప్పులమీఁదఁ గాల్చిన కఱకుట్లవాసనల్గ్రమ్ముకొనియెఁ
ద్రోవఁ బోనీక బల్లెపుల్ ఉవ్విలెత్చి, కడిగి జింకలప్రేలాడఁ గట్టి తిత్తు
లొలుచు భీభత్సరసము మహోగ్రమయ్యె, భుక్తిగొన్నట్టివారి తేఁపులుపొసంగ-

క. చాలఁ గురంగటిమడుగుల, గాలాపు న్వేఁటలాడఁగా దొరకినబ
ల్మీలు చవిఁ దేల్చె నపుడా, పాళెంబున డిగిన బక్కబంట్రౌతులకున్- 108

సీ. వలసినయెడకుఁ గమ్మలుబ్రాయు బ్రాయసంబులవారి గంటాల కిలకిలలును
దొరపలంపిన కార్యసరణు లెంచు నమాత్యకుంజరంబు లొనర్చు గుసగుసలును
బొలదిండి రాయల యలవుల గనివచ్చి పలుచు వేగులవారి కలకలములు
నరస కంపఱటంచు నంతులేర్పడియున్న బలకరంబులవారి యుబ్బలములు
నెఫుసు వెపలు నొకోయంచు నెంచి యాడఁ

జూచు సంగీతమేళంబు సొగసుకాండ్రి
ధిమ్మనెడి మద్దెలల మ్రోత గ్రమ్ముకొనియె
రాజు పవళించు తెలిగుడారంబు బ్రోల- 109

చ. నలుఁగిడి చల్వదాల్చి పయనంపు టలంతల నిద్రఁ జెందరో
వెలఁదులలేపఁ గొంకి పతివింతగుడారపు పారివారిగం
టలరొప కుల్కి లేవఁ జిఱునవ్వులతోఁ దమవారిఁ గూడి యిం
పులతమి దీఱినన్ నిదురవోయిరి నవ్వుబొజుంగు లత్తఱిన్- 110

చ. గుమిగొని తెచ్చికోలుకుసిగుంపులఁ జెట్టులనీడఁ బొట్టిమం
చములపయి న్శయించి పటసారకుటీరము లెత్తి మేలిజా
నమున రమించు పల్లవులనంటున నేరము లెన్నుచున్నృప
ప్రమదల ప్రోల నీటు నెఱపం బనిపూనిరి గుత్తలంజియల్. 111

చ. కనుకని తెల్లవాఱుపనుక వ్రతిగోరెడు పల్లవాళి మే
ల్గనుఁగొని వీడెముంగలుపులాహిరిమేపుల నిద్రఁబుచ్చి చెం
దిన చిఱునవ్వుతో నపుడె నిద్దురలాయని వింతపైఁడి ప
ట్టిన వెలముద్దుగుమ్మలు వడిన్శయనించిరి చప్పరంబులన్. 112

క. అల పాళెమునకు నిలుపని, బలకరమై పారివారిపరిమై తగును
క్కళమై నిదురించని సరి వలపుల వెలచెలుల విటుల వతిఁలు టమరెన్. 113

సీ. ఒక్కండు పట్టుగా నూఁకొనఁ దబ్బిబ్బుబాటు గొల్లసివాలు పాడుకొనుచుఁ
బాముసాడించునేర్పాటునఁ దలయూఁచికొంచును జెంగు విన్పించుకొనుచుఁ
దమవారి గుమిగూడి దమ్మరాజులకత లొన్నటికష్టము లేక నొడివికొనుచు
లయయొక్క త్రోవతాళంబొక త్రోవఁగా నేమేమొ ఢక్కవాయించుకొనుచుఁ
జిటుకుమన్నఁ బరామరిశించుకొనుచు, నంటుకత్తెలు తమపయనంబు సమ్మ
తించకాడిన వగఁ జెప్పుకొంచుమించి, రుక్కళిపునల్లమందుల యొంటికాండ్రు. 114

సీ. వెఱవకుమని వెన్ను చఱచి వేలుపుఱేఁడు తెలిపిననింద్రాణి తెలియ దయ్యెఁ
దనుతానె తెలిసి మూసినకంటితోవాణి వీనులపైఁ గేలు మానదయ్యె
నది పరామరిశింతునని యేగు పతినాఁగి జలధినందనకొంగు విడువదయ్యె
దడదడమన గుండె తాళిబొట్టుచర గుబ్బలిపట్టి పడుకయిల్వెళ్లదయ్యె
బాళెమున నక్కడక్కడఁ బదిలమునకు, మ్రోయఁజేసినతముకుల మొదలిపోటు
దారమ్రోతల పటహంపుధణధణలకు సొంతిగా సంజ్ఞనిటులున్న యుంపలోన. 115

క. అలరాజు విజయ మెనయం, గలఁడని చంద్రుఁడును దారకావనితలతోఁ
గలహించి ముడియనైచిన, పొలుపలరన్ వేగుఁజుక్క పొడిచెం బెడఁగై 116

క. అంతట దనుజేంద్రుం డొక, దంతపుఁజవికెన్ బ్రధానదైత్యులతోడ
న్మంతనమాడుచు నృపుబల, వంతపునైఖరులు వేగువారలు దెల్పన్ 117

క. పదవాళ్ళఁ బిలిచి బలముల, వెదలింపుఁ డటన్న వారు వెసఁ జని నిద్రా
జడులను బలాళి వీనుల, వడిగా మేల్కొల్పి ప్రకృతవార్తలు దెల్పన్ 118

చ. అదరుచు వచ్చె నొక్కపలలాశి నిజాంగన సిగ్గుతోడ న
వ్వొదవెడు చూడ్కిచేతఁ దనయుల్లములోని పురారతక్రియా
భ్యుదయపు వాంఛ దెల్పఁ గనుబొమ్మ నదల్చుచు మీఁది వేలుపు
న్మదితల నంటు దానిపయి ముందుగఁ జొక ఘటించెనో యనన్ 119

చ. ఒకదనుజాధినాథుఁడు మదోద్ధతి గందమలందికొంచు గొం
చెక చనుదెంచె నుగ్రరణసన్నహనంబున రాజమార్గణా
లికి నిఁకె మీఁద డెందము బళీ యిఁకవౌనని బొమ్మగోడపైఁ
జికిలియొసంగి వన్నియలఁ జెన్నగు సున్నము వ్రాయుకైవడిన్ 120

గీ. విరులు సిగఁ జుట్టికొని యొక్క వీరదైత్యుఁ, డరిగె నిఁకమీఁదఁ గల్గు కల్పావనీజ
పుష్పముల సారసౌరభంబునకు వాని, వలపునకుఁ బూని సరిచూడవలయు ననఁగ. 121

క. ఈ నేలచుట్టుఁ దిరిగినఁ, బోనీయఁడు రాజు పాఱిపోరాదనుతీ
యానఁగ నొకనక్తంచర, సూనుఁడు చక్రంబు ద్రిప్పుచుం జనుదెంచెన్ 122

క. అనలోపమన్రుపశరముల, మొనలంబడి తరణిబింబము జొచ్చుగతిం
దనుజుం డొక్కఁడు గ్రక్కునఁ, గనకరథంబెక్కి యక్కు గ్రిక్కుచు వెడలెన్.

సీ. పదవాళ్లగమికిఁ జేపుడికి దబ్బఱనొప్పి పైపైచుకొని మూలఁబడినవారు
నిండ్లలోననయుండి యెటువోయిరో కాన మనిపించి కనిపించకడఁగువారు
నింటికావలికి నిచ్చట నిల్పరు గదా యని వేల్పులకు మ్రొక్కఁ జనెడువారుఁ
దొలునాఁడె నృపుసవార్తలు విని యొక లేనిపనిఁ బూని యెందెందొ చనెడువారు
గ్రాసములు చెల్లలేదని గాసిచేసి, కొలువుజీవితముల కొప్పుకొననివారు,
నగుచుఁ గోఁచపిశాచము ల్దిగులుపడఁగఁ, బక్కరక్కసిదొరలు ముందఱను నిల్వ

సీ. నిలుచుండి వీణ చేతులఁ బూని తెలుగంటిబయకాఁడు మేల్కొల్పు పదముఁ బాడ
నలుసుతో నాల్గుమోములదేవుఁ డొకమోర దినశుద్ధి దెల్పి వేవెనుక కొడుఁగఁ
దనయూరినుండి తెచ్చినపూలమాల జేజేలరాయఁడు చేరి చేతికొసఁగఁ

జొరవచేసికొని శంకరుఁ డిచ్చుకాలకు సఖుఁ డౌకుబేరుపైఁ జాడిచెప్ప
గడియక్కడుక మునుంగుటఁ గని గురుండు, తెల్లవాఱెడునని పఱతెంచి పలుకఁ
గటికవారెల్ల దొరలువచ్చుట వచింప, దనుజపతిలేచి యొకభద్రదంతినెక్కి 125

గీ. కోటకావలికై యాప్త కోటితోన, నీవు నీవని నియమించి నిలిపి తక్క
రక్కసులు వారణంబుల రథములందుఁ, దురగములయందుఁ బొడసూపి తోడనడువ

సీ. చెకుముకి యగ్గిజానకిత్రాటిమిడుఁగురుల్గ్రాఁజెడునది యెలగోలుమూఁక
వెదురుమల ల్వ్రేచ్చ విధమున నీటియెద్దాల్చిపాల్చి యది దండిబారు
తిరుగోపులను దుమ్ము రెగయించునదిసిలేముస్తీబుగల కాలుమొకరిపౌజు
కొమ్ముకత్తుల మెఱుంగుల వెల్లపావడ ల్గ్రానునది మస్తేనుఁగులచయంబు
సురగికిండ్రంబుపిల్లలై చుట్టు నున్న, కనకరథముల నడుమ సింగాణి విల్లు
దొనలు మెఱయంగఁ దేజిపైఁ దోఁచువాఁడు, ధారుణీశ్వరుఁ డని వేసువారు దెలుప

చ. అరిగి మహాభయంకరతరాహవదోహలబాహువ్రతా
పరుచులు వోలు చెందిరప్పుఁ బౌవడచేఁ బుఱచేయి వీఁసు
స్థిరమతి నంపపెట్టుకొలఁదిం గజరాజము నిల్పి దానవే
శ్వరుఁ డెలగోలానర్వఁగ నిశాచరుల న్నియమించి సంతటన్. 128

చ. అలరు మొగంబుతోఁ గువలయాశ్వము నిల్పి నరేంద్రవహాళి తూ
పులపొడిదోయి వీఁపుకడఁ బొందుపడం బిగియించి మించురా
చిలుకలఁ వ్రాఁతగచ్చునని సింగిణి నైకొని యెక్కువెట్టి సే
నలు తనసన్న గోరఁగ గుణధ్వనిచేయుచుఁ జేయి వీచుచున్. 129

క. పేరెములువాఱి యొక్కొక, చేరువ గుంపగుచుఁ దారసిలి యిరువాగుం
ఘోరపుబాణపుఁ జువ్వలు, బోరనఁ గొనవిఱిచి వైవఁ బొసఁగె న్మోపటన్. 130

క. కొనద్రుంచివైచు బాణపుఁ, బెనుజువ్వలు పాఱి నేలపెట్టుగఁ బడుఁజీ
బున సిగిడి కాలుసేతులు, దుసియలుగాఁపించి ముందు దుఱుసున నడిచెన్. 131

క. ఉయ్యాలచేరులనఁగా, నయ్యిరువాగులును దఱిమి యటు దిరుగుచు బ
ల్కయ్య మొనరించి యించుక, డయ్యక యొప్ప పయిఁ బెట్టుటయు నట్టియెడన్.

చ. ఒకపరియొడ్లలోని రిపులుగ్రతనైచు తుపాకి మందు గుం
డ్లకు వెనుదీయకాఁగి యచటంబడు నాప్పులఁ గోలుగొట్టనే
య కనిఁ బెనంగి యంతఁ దరియం బడి యచ్చటివారలం గకా
వికలుగఁ దోలి మొన్నలు విరిసించరి చేయపరాంద్రము మొల్చఁగన్. 133

గీ. అలసినట్టి జనులు తేలి యవలికరుగ, వేణుతుటుములు పెనుబోటు భేరిమ్రోఁత
లమర నరుదెంచి దొడ్డకయ్యమున నవియుఁ, బడలనంతయుఁగనిపండి బారుగదిసె.

క. అంపఱునిట్టులు వచ్చిన, యంపము గనుపట్టెఁ దద్రణాంభోనిధి దాఁ
టం జెప్ప గట్టఁ బూనిన, చందంబున నలుగు లరిదిచాయల నీనన్. 135

గీ. ఒకఁడు కుంతానఁ బగవాని యురముఁ గ్రుమ్మ
వెంటనేయాతఁ డీటెచే వెళ్ళఁ బొడువ
వెలసె నద్దఱు నిల్చిన నిలువు కడన
కాళికై కానడించిన కానుకనఁగ. 136

క. పగవాని గ్రుచ్చి యీటెని, నెగనెత్తెనొకండు రణమహీంద్రుమాలమునం
గగనమునుండి వ్రాలెడు, ఖగపాళుల కంది యిచ్చు కైవడి మెఱయన్. 137

క. జముదాడి నొక్కవీరుఁడు, విమతేంద్రుం బొడిచి వాఁడు వెస నిజభుజసా
రము మెచ్చి చల్లునవకుం, కుసుమబలెఁ దద్రక్తమున నిగుంభితుఁ డయ్యెన్. 138

క. అలుగునగచూపు వేళం, దలతలమను సంతసోఁకిన నమ్మగవానిం
గళదాఁకఁ బెనఁగు నొకడు, కల్లలపుదొరకరాని నీటుకత్తియ యగుటన్. 139

చ. నిగళము లూడ్వనెత్తి కరిణీపతిచేరినఁ దేజిపావడన్
మొగమునఁ గప్పినూకి యొకమొక్కలపు న్నెఱరౌతు కుంభము
ల్పగులఁగ సేసిన న్వెడలెఁ బట్టనువెంటనే మౌక్తికావళు
ల్మగఁటిమి మెచ్చి చేరి జయలక్ష్మి సుమాంజలి యిచ్చుకైవడిన్. 140

మ. బలియుం డొక్కపటాని రౌతు తనబాబానూకుచు న్సైంధవీ
ఖులమాస్ట్రీలతలల్ఖరాసిలతికం దుండించుచుం జుట్టిరా
నలరెం దత్తనువు ల్ధరంబడుట భూతాజ్ఞప్తిచే వెట్టిమో
పులు నేలం బడవైచి కూలఁబడు కాపుల్వోలె నప్పట్టునన్. 141

క. నరపతి యంతట దనుజుల, యురుపడిఁ గని చేయివీవ నుగ్రాకార
స్థిరతంగరులకుఁగరులున్, హరులకు హరులరదములకు నరదము లెదురన్.

సీ. రాజ నాచెయిచూపు గ్రాసంబు ఋణముగాఁ జేయుదునే యంచుఁ జేరువారు
లలితంపుఁ దులశిప్రోగులుద్రుంచి నోటిలో నైచికొంచుఁ దురీనవచ్చువారుఁ
గలనిలోఁ బొలియుటకంటె భాగ్యమ్ములున్న వెయంచుఁ జెగి యనికఱుము వారు
నేలినవానికట్టెదుట నే పనికివచ్చుటగదా మేలని చొచ్చువారుఁ
బూర్వవైరంబు మాని సొంపులు జనింప

నొకని గొకఁ డెప్పరించుచుఁ జికిలియొఱలు
పొఱవైచుచు వడిఁజొరఁబాఱువారు
నగుచుఁ గైజీతములవార లనికి నిగిడి. 143

క. దనుజులఁ గదిసిన నత్తఱి, జనితంబగు ధూళిపాళి చదలఁ బొదలఁగా
ననిమిషకోటికిఁ గరములఁ, గనుదోయిం బులుముకొనుచుఁ గనుఁగొనవలసెన్.

సీ. అరదము ల్దురదుర నరుదార నరుదేఱ నరదము ల్దురదురనరిగె నెదురు
కరులు ఘీంకార బంధురములై నడతేఱఁ గరులు ఘీంకారబంధురత నెదురు
హరులు హేషాతిభీకరములై పఱతేఱ హరులు హేషాతిభీకరత నెదురు
భటకోటి చటులతోద్భటములై చనుదేఱ భటకోటిచటులతోద్భటతమీఱు
సారథులు వ్రాలఁగొమ్ములు చదిసికూలఁ, బక్కెఱలు వ్రీలఁ గరవాలపటలితూలఁ
కేడివారంగ నవి పోరు ఖేచరాళి, హర్షమునఁ జూడఁగా బొమ్మలాడినట్లు. 145

మ. చదిసెం దేరులు పాఱె వారణము లశ్వమ్ముల్సరం గూలెఁ గం
ఠెపరెన్ సైన్యము వ్రాలె బాహువులు ద్రెస్సెన్మాంసము వ్రాలెనం
గదము ల్ద్రీలెఁ గిరీటము ల్పఱచె రక్తశ్రేణి కయ్యంపుఁ జో
కుఱ్ఱదనర్పన్ భుజదర్పమొప్ప నిరువాగుం జేరి పోరాడఁగన్. 146

సీ. వ్రేగులుమీఁదఁ గప్పించి నవ్వెడు తలల్ద్రాఁడులుగల తమ్మితుటుముఁ దెగడెఁ
గెంపుటుంగరపుడా ల్గీల్కొన్న బాహువు ల్ఫణమణు ల్గలయహిప్రభులఁ దెగడెఁ
బలు జముదాడి పోటులమించువక్షము ల్నెఱియ లానిన భూమిసీటుఁ దెగడెఁ
వ్రేటులరక్తము ల్వెడలించుతొడలు కుంకుమనీటి చిమ్మనగ్రోవిఁ దెగడె
దనుజమనుజేంద్రసైన్యముల్ దైన్యమెదలి
కయ్యమొనరింప సంగరాంగణము చూచు
దివిజవర్యులు మొగములు ద్రిప్పికొనఁగ
నప్పు డమ్మక్క యనిపించె నద్భుతముగను. 147

వ. వెండియు నుద్దండతరదండధరకోపాటోప విభ్రమభ్రమిత నయనభ్రమావహస్యంద
నసహస్రసంగతరథాంగనికరాపభ్రవిభ్రమణ విధూత ధూళీపాళికా ధరాధురాన
హ గిరీశవరేణకరీశ్వరంబును గరీశ్వరధారాధరక్షతజపూరపారావార దుర్వారత
రంగాయమాన కనకపరికరంబును బోరనెడఁదగాయంబులవారలం గుంతసంఘ
టితద్వివేటికాడోలికలం గొనిపోవువారును మున్నుఱకమై నెక్కినకత్తళాణంబు
లం బరులపాలు చేయ నోపక డిగ నుఱికి కటారుల డొక్కలు విదారించి

నడచి పడువారును క్షతంబుల వెడలు ప్రేవుల నూడనీక యదిమి కదనోత్సాహం
బున దుప్పటులు బిగియించి యెదిరించువారును గెలుపుగాయంబులఁ బడియుం
డియు మండిగాలిడుకొని కైదువులు జడిపించుకొనుచు రౌద్రాకారంబున ను
న్నవారును గళదెలిసి నలుదిక్కులుం బులుకుపులుకునఁ జూచి మానధనంబునం
దొడిగినచల్లడంబు లక్కడక్కడఁ జించుకొనువారును బ్రాణనిర్యాణసమయంబు
నందును నిజస్వామివిజయంబె విచారించువారును నడుగకమున్న యభ్యర్ణంపునుడుఁ
గుల జలంబు దెచ్చి దప్పి నివారించు బంటుల ఋణంబులు దీర్చుకొని వారితో నా
త్మీయులకు వలయు బుద్ధు లుపదేశించువారును దెట్టువలుగట్టియున్న క్రొన్నె
త్తురులు గనుంగొని నెత్తురుకళవట్టి తమకుఁదామ వ్రాలువారును దొలఁగక
క్కడక్కడభ్రపడచిన ముదురుమానిసులకతంబునఁ బోఁగూడక నమోనమో
యనుచున్నవారును గ్రించుఁదనంబునఁ గొంచెపాటిచెనకులఁ దెచ్చికోలు వేదన
లంబడి తన్నుకొనువారును గలిగి సంగ్రామంబు గావున నధికధామంబును జన్యం
బు గావున భూతక్రియామాన్యంబును సమరతలంబు గావున ధర్మోజ్జ్వలంబు
ను నై యాసమీకంబు సమాకులితనాకలోకం బయ్యె మఱియు. 148

గీ. పోరఁ బెనువానగా రక్తపూరమొలుకు, గాయములు పూను భూతనికాయమలరెఁ
నేళిగతి నిల్చు రణభద్రకాళి మ్రోల, వరలు పన్నీరుతిత్తులవారనంగ. 149

సీ. గ్రుడ్డులు మిడికించుకొని దప్పికిమ్మను దమవారినొక్క బేతాళహాళి
గ్రొంతుమ్రోచిన దిగులొక్కని నోర వ్రేలిడి క్రక్కునొక్కపిశాచికావిభుండు
అన్నువట్టినను మ్రాగన్నుతోఁ బొర్లాడు నేలపైనొక డాకినీవరుండు
కక్కుర్తిమెక్కి యగస్త్యమంత్రమువల్కి బొడ్డు నంటుచు నొక్కభూతనేత
తనివితీఱినఁ ద్రేఁపు విన్నునకునిక్క, శతపదాల్ ద్రొక్కి నొక్కనిశాచరుండు
పలలరాసుల బువ్వంపుబంతివిందు, మించుబోఁడులతో నారగించు వేళ. 150

గీ. ఒక్కనికళేబరమరసియుఁ దగఁదినక, వీనిఁబడవైచె నాతఁ డాపీరుఁ డనుచు
గాపనుచుఁ గుమ్ములాడునక్తంచరాళి, యెంతకార్యంబు దమకేమి యెవ్వఁడైన. 151

క. ఒకవీరవరుకబంధము, నకుమూఁగి పిశాచికాగణము భూతావే
శకమున నది యెగిరినచోఁ, బకపకనవ్వించె నులికిపడి డాకినులన్. 152

* సీ. శౌనకమౌని విశ్వామిత్రుతోఁ దెమ్మి పన్నిదం బనుచుఁ జేపట్టి తిగుప
శుకుఁడు * * * *

---

* ఇక్కడఁ గొంతగ్రంథభాగము మాతృకలో లేదు.

మాలిని. ధారుణిధరణశేషా దర్పకద్వేషవేషా, శరనిధిసితకీర్తి సౌధయూథాగ్రవర్తీ
వరగుణమణిజాలా వర్ణితోద్దిష్టలీలా। నరపతికులహేళీనారసన్మ్రసమాళీ




ఇది శ్రీమన్మదనగోపాలకటాక్షవీక్షణాసమాసాదిత సరసకవితావైభవ సవరమ
న్వయాభరణ నారాయణభూపాలతనూభవ శకగోపతాపసేంద్రచరణారవింద
సంచలన్మానసమిళింద సంతతభారతభాగవతాదిశ్రవణానంద కామినీమనోహర
రూపరేఖావిజితచైత్ర కాశ్యపగోత్రపవిత్ర జాతివార్తాకవిజనామోదసంధా
యక చిననారాయణనాయకప్రణీతంబైన కువలయాశ్వచరిత్రం బనుమహాప్ర
బంధంబునం బ్రథమాశ్వాసము.



శ్రీరస్తు.

# కువలయాశ్వ చరిత్రము.

## తృతీయాశ్వాసము.

---

క. శ్రీరమణీమృదుపదలా క్షారసకోపారుణప్రసారితవీక్షా
దూరితవైరికలాపా, నారీనవకుసుమచాపవారణభూపా! 1

గీ. అవధరింపుము జైమిని కలపతంగ, కులపతంగంబు లిట్లని తెలుపఁ దొడంగె
నట్లు పాతాళకేతుఁ డయ్యాతుధాన, పటలికన్నను మున్నుగాఁ బాఱుదెంచి. 2

క. దళవాయితోడఁ గోటకు, వెలుపటియిగ్గిల్లుగొట్టి వేయించి పిరం
గులు లగ్గంబులమీఁద, న్నిలిపించఁగఁ బనిచి నిగుడు నెవ్వగతోడన్. 3

చ. అరిగిపురంబుసొచ్చి పలలాశనవాళి కుమారుతోడ మే
ల్సరియగు దైత్యులం గనుల న్నిలువ న్నియమించి యాయుస
స్ఫురణఁ బనర్చు కోటతలుపు ల్బిగియించఁగఁ బంచి ధీరతా
స్థిరమతిఁ జేరఁగా నగరుఁజేరి హజారము నందు నిల్చుచున్. 4

క. మించు తమిఁ గణజము ల్దెఱ, పించుచుఁ గైజీతములకు వేర్వేఱన్రావ
యించుచు నెలకొలువునకుం, బంచియిడుచు నుండుగుండుబాణములెల్లన్. 5

క. ఇటు లుండ నచట నృపుఁడు, చ్ఛటగతి దానవుని కూటిపాలెం బెల్లం
దటుకునఁ జూఱలొసంగుచు, నటు నిలువక సేనతోడ నప్పురిఁ జుట్టెన్. 6

చ. అచలితవృత్తి నిట్లు విడియం దళవాయి పలాశి వీడు మె
చ్చుచు నలకోటకేగు జలసూత్రపుఁజోటు లెఱింగి యడ్డ క
ట్టుచు రసవర్గ మచ్చటకడున్వడిఁ జేరఁగ నీక శూరతా
రచనలఁ జిల్లరల్చులుపు రక్కసిపాలియగాండ్రఁ గొట్టుచున్. 7

క. ముత్తికె వేయించిన దితి, జోత్తముఁ డించుకయు బెదరకుద్భటధీరో
దాత్తమతి నగరు సొరక వి, యత్తటి నటునూఱు గవనియందె వసించెన్. 8

సీ. తెఱగంటిదొర నరాధిపు మెచ్చఁ జనుటకై నలువతో నాలోచనంబు సేయ
నిలనుండి వచ్చు వేగులవారి వెంటనే సురహాని గొణుగుచు సుద్దులడుగ
గిరిభేది నగరివాకిటివార్త లడుగంగ దిగధీశులు నియోగి తెగల నంప
అడ్డెలు విడి, వేల్పు లమరగాండ్రసురేంద్రు కార్యకర్తలబందుగట్టికొనఁగ
భూరిభుజశక్తి ముచ్చిమిపోటుగాఁగ, మేదినీభర్త పాలెంబుమీఁదఁబడిన
దానవులమూఁక తన్మహోత్కటకటాగ్ర, ఘాటఁ గేరిడించి కమ్ముకొఁ గోటఁ జేరు.

సీ. ఆచ్ఛర చెలువ లుయ్యాలచేరులు నేలవ్రైచితి రని తోడి వారిఁ బవరఁ
జోటించుకయు లేక కోటరంబులలోని యురవుపాములు పెఱ బొఱియఁజొరఁగ
నఖిలపక్షులకులాయములుఁ బోఁ బిల్లల గఱచి యవ్వలి కోనకడకుఁ బఱవ
ముంచి చీఁకటులుకల్పించు నీడలు పోవఁ బద్మాకరంబుల పాఁచి విఱుగఁ
జెట్టుగులులేని పెనుగారుచిచ్చు వచ్చె, ననుచుఁ జెంచెత లెంపకై యలమటింపఁ
బార్థివేంద్రుని భటులు డాబాలు నడుప, నఱికి రయ్యద్రిపై విపినంబునెల్ల. 10

క. దనుజుల తుపాకిగుండు, ల్గనఁబడు డాబాలు పలకలందాఁకి బిరి
లునఁ దిరుగుఁ దమునియోగిం, చినవారల నొంచ మగుడు చెలువం బమరన్. 11

క. మనుజేంద్రుఁ డంత సేనలఁ, బనుపుచు సురతాణి లగ్గఁబట్టించిన న
ద్దనుజపతి వీరధర్మం, బునఁ జగువకుఁ జొచ్చి యెదుర ముదిరిన కినుకన్ 12

మ. అరరే వేఁడి మెఱుంగు తూపుఁ గొనియయ్యా యెంతయోవింత యా
నరనాథాగ్రణి యేయఁగా నది దిశాంతభ్రాంతరోచిర్నిరం
తరమై వాని శిరంబు నైకొని యనంతాకాంతపైఁ దార్చెఁ దం
తురసంతోషహృదంతులై ధిగధికాంతుల్చెంత చింత ల్విడెన్. 13

ఉ. అంతటఁ జేరవచ్చిన వియచ్చరనాథుల దీవనల్మహీ
కాంతుఁడు గాంచి వారి మృదుగౌరవసారవచోవిభూతి న
త్యంతము సంతసం బొదవ నవ్వు నిజాంచితసైన్యము న్మహీ
ప్రాంతమునందు నుంచి పరహాసవిలాసవిభాసమానుఁడై. 14

క. నగరిపురిపునగరుండ, న్నగరీరథయూథసాధనానావిధరు
గ్గగధగలు చూచువేడుక, చిగిరింపఁగఁ రింపరాని చిడిముడి వోడమన్. 15

క. ఒక్కఁడె పవనోద్భవజవ, ధిక్కరణధురీణ మైన తేజిన్వడిగా
నెక్కి ప్రకాశాత్యవశస, దిక్కంబగు పురముసొచ్చి ధృతి నచ్చోటన్. 16

ఉ. గోడలుగోష్ఠముల్గరిడి గుళ్లు గృహాంగణము ల్గజస్థలు
ల్మేడలు మేలుకట్టులును మిద్దెలు ప్రాకలు మేలుమచ్చులున్
వాడలు వేదులు న్విపణివర్గములు న్వనజాకరంబులుం
జూడఁ బదాఱువన్నె గల శుద్ధసువర్ణము లౌట మెచ్చుచున్. 17

సీ. పరఁగఁ బిరంగీల బలుగుండ్లకై డాఁగఁ బఱుక లమర్చిన పాఁతరల్లును
వెలుపటి మందుతిత్తులు గూలిన యరాబు కొఱకమర్చిన పచ్చిగోడగుంపు
లెనసి మాస్తరు లగ్గకెక్కు సందంగఁ దార్చిన కాంచనంపు సంపనపుఁ జేతు

తెమటి సురంగంబు లెఱిఁగి యా చాయఁగాఁ గల్పించు ప్రతి సురంగముల గములు
ప్రతిబలము ప్రేయు తిరుగుడు జాళ్లకతనఁ, గుమ్ములానిన బంగారు గోడలందలి
పడిన మగరాలు చూర్ణమై పుడమిరాలు, నీలములచాలుఁ జూచి వర్ణించుకొనుచు. 18

క. ఘోరపశాధార నిశా, చారికృతాంగులను జూచి జడియఁడు దనుచున్
సారతరదాత్మమహిమం, బూర ధరాజాని యభయ మొసఁగుచునంతన్ 19

సీ. కోటపెట్టికి ముద్దుగుమ్మలతో మట్టి తట్టు లందిచ్చు గంధర్వచయముఁ
గనుసీళ్ల పులిమికొంచును బానశాలలో మంచు గట్టించు నమర్త్య కులము
మలఁగికొంచును ఫిరంగుల లగ్గములమీఁది కురువడితోఁ జేర్చు నురగగణము
బలిమికాండ్రగు రక్కసులకు సంకెళ్లతో జలకుంభములు మోచు సాధ్యపటలి
విబుధరిపు పాటుఁ జెప్పకో వెఱచి ముత్తి, యపుడు హాజారాన గుసగుసలాడుచున్న
కిన్నరశతంబుఁ గని బుజ్జగించి పనిచి, ననుచు వేడుక తోడుగా నగరు జరిసి. 20

సీ. నలఁగిన మైలచీరలను మైఁ బొంగారు సిగ్గులు బంగారు నీరుగాఁగ
ముడివీడు నిడుదక్రొమ్ముడుల డాలు శరీరమునకు నల్లని మేలిముసుఁగుగాఁగఁ
బదలించు కఠినభూభాగమ్ము మీఁద నిబ్బరపుఁ జూపులు కల్వపాన్పుగాఁగ
నాఁకటి కన్యోన్య మలసతమై నాడు మాటలె యప్పుతంపు తేటగాఁగ
దనుజు చెఱసాల నున్న గంధర్వకాంత, లపరిపాటునఁ దనుఁజూచి బెదరి లేచి
కొంకుసిగ్గులతో మఱుఁగులకుఁ బోవ, నిలచి వారలఁ జేర్చి మన్నించి పనిచి 21

క. తోవరాచరాతినిద్దపుఁ, జవికెల తెగల న్నగళ్ల చావళ్లను నుం
బవడపుఁ గొణిగెల లోగిలి, సవరని కేరులును దాఁటి చనఁ జననెదుటన్. 22

గీ. పచ్చిదేరఁ గఁ జిలుక బాబా వజీరు, జగడముసఁ గుమ్ములాడు నచ్చరమిటారి
కత్తెయల వేల్పు సెజ్జనీటు కాంత్రప రూప, ముందు బొమ్మలుగల మేడయొకటి గాంచి.

క. తగురా మగరాసిగనిగ, లగురా తోగరాచసాలల స్వప్నను వుం
బిగడాలడా లిడెంతటి, సొగసని తేజీని డిగ్గి చోద్యంబలరన్. 24

మ. చనుపో నాతని కందుఁ గర్జపవ విశ్రాంతంబు లయ్యెంగడున్
వనితా యెంతటి వేల వే నెలఁత యైనం జింతనే చింత గుం
దునటే యంపని మ్రాని పండులకుఁ జేతుల్ చాతురే యైన న
ద్దను జోపంత మెఱుంగు నంతకును గాంతా తాళుమ స్వాక్యముల్. 25

క. అది విని మఱియున్ వినివిని, యిదియేమో కాని చూతమిపుడనియవనీ
ధవనేత బూరికోరిక, నవలికి జని జనిత విస్మయ నిమగ్నుండై. 26

సీ. పలచనిపావడపై నొంటి కట్టుగాఁ గట్టిన వలిపె చెంగావికపము
పాన్పుపైఁ బొరల నిబ్బరపు గుబ్బల పొరపటలి పెట్లునఁ జిటిలిరాల
కెరలు నిట్టూర్పులఁ గెమ్మోవి, బగులంగ గోరునఁ జిమ్మ కన్నీరువడిన
బంగారు గోడకరంగిపోవఁ బలాట బటువుల్లంతటఁ బడఁగ నేమె
పనికిదిగ్గనలేచి పూపాన్పుమీఁద వ్రాలి కూర్చుండి ముక్కుపై వ్రేలు నిలిపి
యొక్క చెలికత్తె యూరార్పఁ బెక్కుతలఁపు లన్ను కొననున్న యొకవన్నెలాడిఁ గాంచి.

మ. భళిరా కన్నులు మీలఁ గీసొగసు రూపా చాల సేబాసురా
కళలందించ్చు మెఱుంగు ముద్దుమొగ మింకం జంద్రుఁడాదీనిముం
గళ నౌరా బలితంపు గుబ్బలివియే కాబోలుఁ బూచెండ్ల మిం
డలు పేలే కురు లింద్రనీలముల కన్నన్ మిన్నలౌ నేకదా. 28

క. నెమ్మిగదా నడతమ్మెప, దొమ్మిగదా బెడఁగుగురులు తొలుకరిమించుం
గమ్మగదా మెయి మరు దో, దుమ్మిగదా తగిన చూపు తొయ్యలికిఁ భళీ. 26

ఉ. పబ్బర కౌను మాట వనితామణి కౌను మెఱుంగు జాళువా
గుబ్బలి జేని కోటవలి గుబ్బెత చన్గవ వేల్పు రాచరా
వ్రబ్బల మేలి తేట యలరాజముఖీమణి వేణి కారుచుల్
లిబ్బిపడంతి పట్టి కవలీల జయంబగు దీనిప్రాపునన్. 31

చ. కలకల నవ్వునట్టున మొగంబు వరాలను చారెడేసి క
న్నులు పిడికింటిలో మిను మినుక్కను కౌనును ముద్దుగారు ప
లుకులుఁ జెవికమ్మ చేఁ బళుతళుక్కను చెక్కులుఁ బట్టెడేసి గు
బ్బలుఁ గను చూపు మేరకు గుభాలను తావులు దీంకే తగున్. 32

ఉ. జక్కవపిట్టలున్ గలికి చన్నులమిట్టకు నేమిపుట్టువో
చక్కెరబొవికిన్ వనిత సన్నపుమోవికి నేమి వావియో
నిక్కువదానికిం జెలువ నిద్దఁపుమేనికి నేమి నేస్తమో
చుక్కలకోటికి న్మగువ సొంపుల గోటికి నేమి కూర్మియో. 33

క. అనియెంచి యించుమిలుపి, రుని యలుఁగులగుంపుమది చురుక్కన నాటన్.
జనియించిన తమకమున, గ్కొనిముంచినఁ గఱఁగి తెచ్చికోల్ ధృతిమించన్. 34

క. ఎంత కడంగి నుతించిన, నంతకుఁ దగునేకదా మహాళినవాళీ
కుంతల కాంతనసుమనః, కుంతలసపహాంగకంది కుందెడిదేమో. 35

చ. కనుగవ కెంపు కొప్పువిసఁగా ముడిగొల్పెడు బొందిమీఁది జం

కనసెఱఁజూపు నెవ్వరు నగించని నవ్వు బయల్ గుఱించి ప
లుక్కను గళ దేరు మేనుఁ గనుఁగొన్నను జక్కెరబొమ్మయొక్క చ
క్కని మొగవానికి న్వాలచేఁ గావలయుం గలయం బలంపఁగన్. 36.

క. బలవంతపు వలవంతలఁ, జెలువంతయు నేరి సొమ్ముఁ జేసెనొకో యీ
వలపునఁ బగిలినవానికి, దలపున లవలేశమైన దయ లేదే మో. 37

ఉ. వానిదిగాక జన్మమును వారము నీరమణీలలాల య
య్యో నగు బాటుగా నతని యొద్దకు నెచ్చెలిఁ బంచి పంచినం
దాని టురాక వేఱిమియొనర్చునొ నావలపంచు నించు వి
ల్కానికి లొంగి నెమ్మదిఁ దలంచుకొనన్ వలపించె నెవ్వఁడో. 38

క. అవ్వల నొకనికి మీఁదుగ, జవ్వనమిటు గట్టియున్న జలజేక్షణతో
నెవ్వగఁ బలుకులు పలికిన, నెవ్వగ యేకాని చేర నేరవు కోర్కుల్. 39

గీ. ఐన నేమగు దీనివృత్తాంత మెల్ల, దెలియవచ్చుగదా యంచుఁ దొలఁగి యొక్క
లోవమఱుఁగున నిలువ నాలోలనయన, జేరి నెచ్చెలి హారాళిఁ జిక్కుదీర్చి. 40

మ. తలిదండ్రుల్ మన మానిశాచరునిచేతం జిక్కి దిక్కెడి యీ
యిలఁ గాసిల్లుట గానకేమయిరొ వారేమైనఁ గానిమ్ము నీ
యెలప్రాయంబు నిరూఢి కాసపడి వీఁడేమేమి గావింప వ
త్తెలుచున్నాడొ యెఱుంగ మిందులకె యింతీ వంత లేదాయె నే. 41

క. అక్కఋతధ్వజభూవరుఁ, డెక్కడ నీ వెక్కడే యిదేమిటికే నీ
చొక్కపుఁ జక్కని నెమ్మో, నిక్కటియ కోర్వనేరవే వగయేలే. 42

చ. తలపున నెంతి మోహపరితాపము గల్గిన దాచుకొందురో
యలయక లేక యీకరణి నంగడి వెట్టిదురో వధూటులా
పలుకవు నిన్నువంటి కులభామలఁ గానవొ వారి కాత్మ నా
థులపయి బాళిలేదొ తమి బుట్టిన పట్టున మట్టు పెట్టిరో. 43

క. తగులెఱుఁగఁ జేసి కూడఁగ, మగవానికిఁ జెల్లుఁగాని మఱియెంతైనన్
మగువకుఁ జెల్లదు పూఁచట, నగుబాటగుఁ బిన్నపనులనన్ రాదు చెలీ. 44

ఉ. నీమది నింత కోరిక జనించినయప్పుడు యెట్లు కూర్చునో
యామరుఁ డింక నిన్ను వసుధాధిపమౌళికిఁ గూర్చకుండ నే
మేమనమంతగా రిపులమే మఱివానికిఁ దానఁగీతిగా
దేమరి యాప తప్పిన సతీవిను మొక్కటి సావధానవై. 45

క. మనలం దెచ్చిన యాశ్వైత్యుని బాధలం గలంగి మునులుతో తెరంగన
జనపతి యాతనితో నిడె, యనిసేయుచు నున్న వాండటంచును వింటిన్. 46

క. పురదనుజ కామినులు కా, తరలై తరళైకహృదయతం గుందుచు నా
తురలై గరళైధిత వా, క్పరతంత్రత మాని యునికి గనుంగొనుమబలా. 47

క. గావున నృపతిజయించెం, గావలయుంజూడు మెదమ కన్నద రు నసం
గావిని పలికిన దానవు, నీవాయని చూరి కామినీ మణి కలంకన్. 48

గీ. యేటి పలుకమ్మ యతడు నన్నేల యేలు, తిరిగి సంధించి నన్ను బోధించరాదు
మింత యేమిటికింక నాయించు వింటి, వానికెక్కిన ప్రాణమే వామనయన. 49

చ. అనిపలుకం ధరాధిప సురాధిపుండీసతి నెమ్మనమ్మునన్
ననుసెనయం దలంచుట కనంబడె బోటి ఋతధ్వజేశ్వరుం
డని కొనియాడె గాన నటులైనది నిక్కమయ్యె నేని నే
డనువిపుడీ వధూమణి పదంబుల పైవంగం దాముసింతునే. 50

శా. నాభాగ్యంబదిరయ్యె యీయతివ యంపంబిందు భావించినా
కేభంగింగవయంగం గల్గునని యూహింపన్ మనస్కంబుగా
నాభీలాభవ భూరి ఫాలవహనాభానంగ కౌక్షుయక
క్షోభక్షుయ్యతం జెంది యున్నయది యిచ్చో మెచ్చ వచ్చుంగదా. 51

చ. ననుంగొని తెచ్చినట్టి మునినాయక నిన్ను నుతింతు నోబలా
మునిం గొని యాడనేల పెను మొక్కలిరక్కసి జేనిక్తై కదా
యనుకల భావనాపరహయంబుగ వచ్చితి గాన నింక నా
తని యవదానమెంచవలదా జలజాలక నిందుం గాంచుటల్. 52

చ. ఇపుడిటు కానుపించుకొని యేను ఋతధ్వజరాజనందు
డట్టపు డమిం దెల్పి జాణయగుటన్ జెలి యెవ్వలికేంగ సిగ్గు దో.
రపువగకొంత జారంగ బరాబరి సేయుచునిందు మారుక
య్యపురుచిం జూపి దీనివిరహాంబుధికింగడం జేరనిత్తునో. 53

సీ. యీగుబ్బలింకమీంద నాగోటికొనధాటి గదిసిన గజిబిజి గాకయున్నె
యీమోవియింకమీంద నామోము మునిపంటి ఘాతచే నలిబిలి గాకయున్నె
యీదేహమింకమీద నాదు కౌగిలింత వగచేత వసివాడువాడకున్నె
యీవురు లింకమీంద నాకూర్మిపెనంకువ, పాటుచేవడిం జిక్కువడకయున్నె
చిక్కువడుగాక యేమినా చింతదీర, ననుభవింపక పోనేర నకటయిట్టు

జేసి తలచితిఁ బువ్వుబంటిదిలతాంగి, గాననొకయింతయోర్వదోకద యిదేల 54

క. భళి యేటి కోర్కు లివితో, య్యాలిచేఁ జేర్కొన్న యట్టి యాతని ననుఁగా
దలఁచితి వేఱొకఁడెమో, యిలలోన ఋతధ్వజేంద్రు లెందఱు గలరో 55

గీ. ఐన నొకసాధనం బున్నదా ఋతధ్వ, జేశ్వరుండీ పలాశిలోకేంద్రుతోఁడ
నని యొనర్చుచు నున్న వాఁడని వయస్య, పలికెఁ గావున నతఁడె కావలయు నేను. 55

క. అన్నిటికిని మంచిదియే, సన్నలతాంగులను డాయఁ జని తద్వచనా
చ్ఛిన్న మకరంద ధారా, భ్యున్నతికిం గర్ణపుటము లొగ్గుటయనుచున్. 56

ఉ. లోవ మఱుంగువాసి జనలోకరసాకరబాకశాసి స్మై
తావులకంటె మున్నరుచి ధారలు బారలు దీర్పఁగా రతి
స్త్రీవిభు రంభ చుట్టమును జెక్కులి గొట్టు నొయారమొల్కఁగా
నావనజాక్షు లున్నయెడ కద్దరిపాటున వచ్చి నిల్చినన్. 57

చ. కనిహృదయంబు ఝల్లుమన ఘల్లుమనంగఁ బదాంగదంబు ది
గ్గన వెస లేచిలేనడ యొయారముతోఁ దెరచాటుఁ జేరఁగా
మినిచెలికత్తె తత్తరము మెక్కొన గద్దియఁ దెచ్చియుంచ మిం
చిన తమినందు మీఁద నివసించె ధరావరుఁ డాదరాత్ముఁడై. 58

ఉ. అంతటలో ఋతధ్వజ నరేంద్రుని మోహనమూర్తి మున్న గ
న్నంతయుఁ గన్నులంబడిన నాతఁడు కాడ యతండె యాగదా
కంతుని దాడికిన్ వెరవగా యని డెందమునందు నెంతయుం
జింతవహింపుచుండె సరసీరుహలోచన బోటి యచ్చటన్. 59

చ. ప్రకట గుణాంక యోపురుష సింహమ నీమహనీయమూర్తి మా
మకహృదయాంబుజమునకు మక్కువ నెక్కొనఁ జేసె నింకఁగొం
కక కనిపించమంచు నడుగన్ బనిలేదయినన్ శుభాభిధా
యకమగు నీచరిత్ర ముదయంబులకుం దగు నంద మొందఁగన్. 60

చ. బహుతరదేహధామ ఘనబాహు విహారముఁ జూచినన్ మహా
మహుఁడవు గాక యొక్క నరమాత్రుడవే యనిదా నెఱింగియున్
సహజపుముగ్ధతాగుణమునన్ వినఁగోరితి గాక నీశుభా
వహన ధురీణమైన గుణవారము నే విను నంతదాననే. 61

గీ. ఓ మహాభాగ నీకథాభ్యుదయమెల్లఁ, దగినచందాన వినినయంత దాక లేదు
పారవిరహిత ఘోరార్తి వారిరాశి, మగ్నమామకచేతోతి మహిమకతన 62

క. కతలయ్యా మావిత మా, వెతలన్నియుఁ దెలుపఁదున్న వీనవు వినుమా
జతనమున గుణము లనియెడు, రతనంబుల గని యటంచు రమణివచించున్. 63

న. అని చెప్పి మఱియు నెచ్చెలి యిట్లనియె. 64

సీ. అనఘ విశ్వావసుండనియెడు గంధర్వరాజు దుర్గాపురిత్రాత వెలయు
నతని పాణిగృహీతి హారిణియనుపేరుగొరి కాంచినముద్దుగుమ్మ మించు
నాయమ్మ సుతులెందఱైన గల్గియు కూతు, రొకతెలేమికిఁ జాల నుమ్మలించి
యాత్మజాత నొసంగుఁడనుచుఁ దేవుండనియే, కంటఁ బడురాతికెల్లమ్రొక్కి
నట్టిదకదా వధూటుల కల్లుఁడనుచు, నగవు పగవులటంచు నెయ్యంబులంచు
సంపకములంచు మఱియెన్నియైనకలవు, కాంతులవియుండె మీఁపటి కతలువినుము

గీ. అంతనక్కాంత గర్భాలసాంగియగుచు, నాకుఁ దెలియదుగా యొక నాటి రేయి
నంపఱును మంచిశుభవేళ యనుచుఁబలికి, రప్పుడీ యుద్ధరించెడు నమ్మఁగనియె. 66

గీ పుట్టినప్పుడె జవ్వనంబును సమస్త భామినీకోటిఁ దలదన్ను పాటిచెలువు
గలిగె దీనికి నదియె దుఃఖములకెల్ల, మూలమైనది యంత నాలోలనయన. 67

క. అసమాన వయోమానమున, లసమాన కలాదులం జెలఁగఁ జూచిమదా
లసయనుపేరిడె విశ్వా, వసుఁడున్ హారిణియు గారవంబునఁ బెనుపన్.

ఉ. అయ్య పరాకు మాప్రియవయస్య యటంచు వచింపలేదు మా
తొయ్యలి వీధిలో నొఱపుతో నడయాడఁగఁ జూచెనేని యా
తియ్యని వింటిజోదు శరధిం గదియించిన పూవుఁదూపులే
యెయ్యెడ వైచికొంచుఁ దమి హెచ్చినఁ బోఁ బొరలాడకుండునే. 68

క. ఏటికి మాటలు నాఁటికి, నేఁటికి మగవాఁడు వలచునే కద వినుమా
బోటి తటాలునఁ జూచిన, నాఁటదివలచు న్మనోంబుజాగ్రమునందున్. 69

సీ. బలవైరి పనిచినఁ బిలువ వచ్చినవానిఁ, గనుసన్నచే నిల్పి కడకుఁ బనిచి
మూపుపైఁ గేలుంచి ముచ్చటాడుచు వచ్చు నలకూబరుని మన్ననలు వరించి
నెనరుతోఁ గడుసాచి కొనివచ్చు నును గచ్చు టరిగెలవారి నందందునిల్పి
కడువేగ మడుపులు గైకొని యుడిగంపు రాజీవముఖి హోజారమున నిల్పి
కొలువునకు నేఁగు రంభ నిచ్చలముగాఁగ, నగరులోపలఁ జొచ్చి మానాతిఁ జక్క
దనము వీక్షించి యామె నిద్దంపుఁ జెక్కు, నొక్కముద్దిడుకొనిపోవు నొక్కవేళ. 70

సీ, శచిచేత జంభశాసనున కొక్కొకవేళ స్వారిసరాగాలు జరుగఁ బాసె
రంభచే నల యక్షరాజపుత్రకునకు లలి హుషారుగ వెషలంగఁ బాసె

బార్వతిచే నర్ధ పద్మారి వహాళికి నిట్టట్టుఁ బీఠంబులెత్తఁ బాసె
కమలచే నీలమేఘశ్యామమూర్తికి గరుడునెక్కి వయాళిగనఁగఁ బాసె
నెందుసర్వసుపర్వపర్వేందుముఖుల, చేతనిశ్శేషదేవతాశ్రేణికెల్ల
సవన కొటులలోఁగట్టుగవలఁబాసె, ననఘ మానాతి జాతురో యనుభవమున. 71

ఉ. అవెతలెన్నియైనఁ గలవయ్య మహాత్మ వచింప భారతం
బీవనజాక్షి మెచ్చఁ జనదెవ్వరినెట్టి మహానుభావుతే
జోవిభవంబు దెల్పినను జక్కను నెవ్వరి రూపమెంచినం
దావినవట్లు పోవునొక తప్పుపనుల్ గదియించి యవ్వలన్. 72

గీ. అంత నొకనాడు తలితండ్రు, లనుప భూమిఁ గలవిశేషంబు లీక్షింపఁదలఁచియేను
లోనుగాఁగల నెచ్చెలుల్ వేనవేలు, గొలువ సిగ్గుజయాన యియ్యలకు డిగ్గి. 73

క. ఇందుఁగల పుణ్యభూముల, నందందుఁజరించి కోకిలాళిమదాళీ
కందళిత కేళిపాళిన్, నందనముం గేరు నొక వనంబున విడిసెన్. 74

చ. విడిసినయంత నొక్కదొర వేఁటకు వచ్చెనొ కాని కొంచెపు
న్నడగని నెక్కిచేతను గనంబడు నెట్టెము మీఁది డేగయున్
బడలినమోము గువ్వగుమి పట్టుల బాలెదు చూపు మించఁగా
దొడిఁదొడినూడిగంపుఁ దెగతోఁ జనియెన్ మముఁ జూడఁదేమియున్. 35

గీ. అతనిఁ గనుగొన్న నేకన్నెయైన వలచు, నమ్మహారాజుదురగవేగాతిశయము
నంది చనలేక యంతంతనరుగువారి, నడుగవారు బుతధ్వజుం డనుచుఁ జనిరి. 76

గీ. అతనిఁ జూచినపఁట యీసుధాంశువదన, యదియనెపముగ రతిదేవియాజ్ఞ మెచ్చి
నోటికందియ్యవగకోటి నూటికోటి, యెసనేర్చి మనోజాతుఁ డింతిమీఁద. 77

చ. అదిమొదలీవఘాటి విరులంటదు కస్తురి గీరుబొట్టు పె
ట్టదు పువుఁదోట రాయదు పటంబులు వ్రాయదు వీణచెంతఁ జే
రదు నెనరైన చిల్కనుకరంబున దాలిని ముద్దటించుఁ దా
గదియదు కంజకాండ కరకార్ముక కర్మహతాహతాంగియై. 78

చ. చెలుల మొఱంగినిల్చి తనసిబ్బెపు గుబ్బలు నారతీరు ని
గ్గులుగల కేలుఁదమ్మి కనుఁగొంచు నయో యిటువంటి మేనికిన్
వలదె తదీయచారుతర వక్షము తం బువుఁబాన్పఁ బోలె నీ
యలసత దీప నిద్రఁగననంచుఁ దలంచి విచారురాలగున్. 79

చ. ఎలమిఁ జకోరపాళి తనయింటికివచ్చిన యట్లు గా మదిం

దలఁపుచు నిస్తుతో మరుగునన్ నిలువంబడి వచ్చి నాతఁడా
చెలువుఁడు చూడరేయనినఁ జెల్వలిఁ దెవ్వరిఁగానమేయనం
దలఁకుచుఁ జూచి కల్లయె యనంగడు వెల్వలఁ బాయ దీనయై. 80

సీ. అధిపప్రతాపాగ్ని నరికట్టుకొన్నట్టి, సొంపునం గనుఁదోయి కెంపుపసరఁ
బతికీర్తిచంద్రికాపటలిఁ గౌఁగిటఁ జేర్చు మాట్కి మేనున బాండిమంబు వెలయ
విభుదానధారాంబువితతికిఁ జోటిచ్చు పోలుపున శ్రమజలంబులు చెలంగ
నాయకధైర్యంబు బాయకుండఁగబట్టు కైవడి నైశ్చల్యగరిమ మెరయఁ
గడపట నిజేశు మదిలోనఁ గట్టివైచి, కొన్నగతి సంతతధ్యానగుణము దనర
నమరియునతండు గనిపించినట్టులైన, నదరిపడి లేచు రేలెల్ల నిదురలేక. 81

సీ. తలఁ చూపవెఱచు నీయళివేణి సమరంపసుమబృందనవకాంచనములు గన్న
పెదవెత్త వెఱచు నీబింబోష్ఠి తరువార సుకుమార తతధీర శుకము గన్న
బొడఁగట్ట వెఱచు నీపువుఁబోడి ఝుంకార భారాతిభయదషట్పదము గన్న
నడుగిడ వెఱచు నీయబ్జపాదసమీప వికటానుభావహంసికలఁ గన్న
వెడవిలుతుచేతనగు నలజడియుఁ దేనె, జడియుగమ్మని దెమ్మెరల్ తొడరు జడియు
నలయు నెమ్మెనఁ జలువఁ దాకలపరించుఁ, గలవరించు నొకానొక కలవరించు. 82

క. పొన్నలకుం దెలిజాబిలి, మిన్నలకుం దలఁకు చిలుక మేలిమిపలుకుల్
విన్ననగున్ విన్ననగున్, గ్రొన్ననగుంపులకు దిగులుకొని మదిఁ బొగులున్. 83

క. ఈరీతి నారికీరీ, శారీభారీకృతోక్తి చకితాత్మికయై
పారరహితవిరహదశా, పారావారమున మునుఁగఁబడియున్న యెడన్. 84

మ. తనరెన్ మన్మథజైత్రయాన సుముహూర్తప్రక్రమంబేను పే
యనిశృంగారము భూరుహాళికి రతివ్యాలోల బాలామనో
జ్ఞనవప్రేమలకుబ్బు మంపలి వధూజాలంబు పాలింటి పి
ల్వని పేరంటము వాసనాజనకమై వాసంతమాసంబిలన్. 85

క. జెడగడరెలతా వనితలు, నడతెంచు వసంతరాజునకు నడుగులకున్
మడుఁగులు వఱచినకైవడి, నడరెడు తెమ్మెరలఁ బండుటాకులు రాలన్. 86

చ. తనరస మెల్లఁ జూపవలదాయని వేళ యొఱంగి యత్తరిన్
గనఁబడు మన్మథాగ్ని మొలకల్ వలె మోసులుగా జనించి యా
మని పథికాంగనాపురుష మంపలి డెందములొందఁ బంచివే
సిఁగతి కెందుగాగ విరిసెం పలి రాకు వనాంగణంబులన్. 87

ల్వొడి పంచప్రసవమొుక్కు తేఁజెఱకుమేల్వి ల్లెక్కు డించంగ న
న్వేడవిల్కానికి దూరదేశగమికోవి శ్లిష్టమోహానల
జ్జడిమాకంపితనైర్యసంపతిహారచ్ఛైత్రాదియాత్రారతిన్. 97

క. అతఁడేఁ పమి వెగ్గలమై, శాతోదరి పొగుల మిగుల జడిసి శరీర
దౌర్బల్యకము లైన చిన్నెల, చేత న్విరహ మెఱి తెలిసి చెలువలు తమలోన్. 98

సీ. ఆయొనమ్మ యిదేటి యాగడా లిదియేమియొఱుఁగు నిన్నటినేఁటి మెఱుఁగు బోఁడి
యొఱుఁగునా యనఁగూడదిప్పు డిప్పుడు కొంత గడిదేఱెలే వలకారిపగల
గడిదేఱ కింక నెన్నఁడు మంచిమగవానిఁ గోరించు జవ్వనం బూపఁజేయు
జవ్వనం బౌనెకా చదువుకొన్నది గాన మనసు నిల్పఁగలేక మరులుకొనియెఁ
జెలువ యీబాము లనుభవించినను గాని, తెలియదే ప్రేగులోపలి తీఁట వంటి
వలపుకసికోఁత లివిపగవారి కైన, వలదుగా దీని కిపుడేల వచ్చెనమ్మ. 99

చ. తడఁబడు మాట గద్గదిక వార్కొను నిల్చినచోట నిల్వరా
దడుగులఁ దొట్రుపాటు గదియంబడుఁ గంపము, చెందు నిద్ర రా
దెడపని కోర్కె హెచ్చు మది సేమొ వితావిత జాలిజాలి యా
నడిగినఁ జెప్పఁగూడ దకటా మరులెత్తిన యాఁటదానికిన్. 100

క. ఇవి యన్నియుఁ జెలులారా, చివురాకుం బోఁడియందెఁ జెలువొందెడు ని
క్కన మింతకు విరహమహో, దన మేకార్ణవము మీఁదఁ దగ వెయ్యదియో! 101

మ. అతివా యింతపమున్న నవ్వొలిచె డాయంబోయితిం బోయిన
న్నొలివా యంచనె నేడ కంటి నరోజీవాక్షి యే లెస్స వేఁ
డితిఁగా నిన్ననె నేటికే చెలువ యంటి న్నావెత ల్నీకు స
మ్మతమా యన్న వితాకురాలయితి నమ్మా కొమ్మ యమ్మాటకున్. 102

క. అని దట్టుసేయ బోఁటులఁ, గనుసన్నలఁ గడకుఁ బోఁపఁగాఁ బనిచి నసుం
జనవిచ్చి మనుపుఁ గావున్, నెనసినచెలిమి వనితఁ జేరి యే సెయ్యమునన్. 103

గీ. వచ్చి తడవాయెఁ గద మహీవలయమహిమఁ
జూచిన ట్లాయెఁ గద యింక శోభనాంగి
పోసనలవదె మనపురంబునకు మగిడి
తల్లిదండ్రులు కడుఁ దల్లడిల్లకుండ. 104

క. తెలిసె నిఁకఁ గొన్ని నాళ్ళు, యిలఁగల చెలువములు చూడ నిచటనె నిలువం
దలఁచినకైవడి నున్నది, చెలువా యెద తెల్ప యట్లు చేయుట మేమిఁ? 105

క. అననన్నుఁ జూచి తలవాంచి, చిన పద్మాంగిఁ జేరి యేమొ చింతాసంతా
పనియాధిఁ జెందునంతము, గనఁబడియెడు నిట్టు లౌనొ కాదో యెఱుంగన్. 106

చ. సరసిజగంధి నీమది విచారము దోఁపఁగ వేఱొకండు లే
పరయఁగఁ గారణంబు నవయౌవనరూపకళావిలాసభా
స్వరుఁడగునట్టి యొక్కమగవానిపయిం గనుపైచి తేమొ దు
ష్కరతరచింతచే నదియె కావలయుం బలపోసి చూచినన్. 107

మ. బలభిన్నీలకచామణీ యిదియుఁ దప్పా కాంతులంగోరి కాం
తలు చింతింపరొ కంతుసంతముల సంతల్లింపరో లేక నీ
తలనే పుట్టెనె యైన నేరమొకఁ జేతత్కార్య మాద్యంతముం
దెలియం బల్కక యుంట నీవలన నింతీ యంతనే వింతచే. 108

క. నావంటి బోఁటి గలుగం, గావగవఁగ నేల యెంతకార్యం బైన
న్నీవే కానలె నన్నుం, దైవకటాక్షమునఁ గరగతము సేయ నటే. 109

చ. అనవిని యాలతాంగి నగవామతిలన్నను జూచి భావజే
దినివి గదమ్మ నీకు నిఁకఁ దెల్పకయుండఁగ నేర్తునమ్మ నీ
యనువు మదీయఘోరవిపదబ్ధికిఁ దోడ గదమ్మ వాఁడి మై
నొనరినకంతుతూపులకు నోడఁగదమ్మ యిఁకన్ వధూమణీ. 110

గీ. నాతి యెఱుఁగుదువా యల్లనాఁడు డేగఁ, జేత నహియించి చిన్న తేజీదువాలిఁ
గాఁగఁ దోలుచు నీత్రోవగా నె చనియె, నామనసు వానివిూఁదనె నాటెనమ్మ. 111

చ. కలకల నవ్వుమోము పురిగట్టిన నెమ్మయి నూగునూగు మీ
సలు నపరంజిడాలెగుబుజంబులు చక్కనిముక్కు తేటక
న్నులు నిడుసోగకన్బొమలు నెక్కిన గ్రక్కునఁ బాలుగాఱు చె
క్కులు సిసునుంతకౌను తలకుందొడల లాస్యపమాళికే తగున్. 112

క. కనమో వినమో ఘనమో, ఘనమోహనమోదకారికచ మగవానిం
దినముం భువనంబుల నా, మనము స్మరియించువాని మఱిగంటి మటే. 118

గీ. వనజలోచన నేనుగానలసినట్టి, దానసైతేని నెటులైన మానవేంద్రుఁ
గూర్చి నా ప్రాణ మిపు డెత్తుకొమ్మ లేని, పక్షమైనను నామీఁదిబాళివిడుము 114

క. అని పలికి సొమ్మసిల్లినఁ, గని దీని మనంబు తెలిసెఁ గద యిఁకమీఁదన్
మనసిజుఁ డపయుఁడు శరమే, సిన నేమగునో పరాకు సేయుదమనుచున్. 115

గీ. ఎంతలే దింతి యిఁకఁ దెమ్ము సంతసేఁజ, యిందులకు నట్లు యొనఁగూర్చికొంద మబల

యప్పుడు నీచిత్తమే వచ్చె నిపుడు వట్టి, మాటలాడినఁ గలవమ్మ మానునమ్మ. 116

క. కొమ్మలకుం బురుషులకుం, గమ్మని విలుకాఁడె వేల్పు గావున నతని
న్నెమ్మదిరాఁ బూజింతము, రమ్మా యలకేలివనికి రాజీవముఖీ. 117

క. అని పలికి యేను నెచ్చెలు, లును మచ్చిక హెచ్చినవిలోలేక్షణఁ దో
డ్కొని వచ్చి కుసుమవిస్మయ, వనిఁ జొచ్చి రసార్ద్రవచనవైఖరి దెలయన్. 118

చ. అలనఁటఁ జంబలాలియుతమై సుమనోహరచాపహర్యన
ర్గలగతిమించి పాదపవికస్వరవైభవహారియైన యీ
యలఘువనోల్లసద్ఘనమహత్త్వము నేమని చెప్పవచ్చునో
లలితలతాంగి కామితఫలంబు లొసంగుచుఁ బ్రోచునంచలెన్. 119

మ. పొలఁతీ యీపొన్న గున్నపొన్నవిరికిం బూఁదేనె బల్కాల్వగా
యలరన్ సారెకు నెక్కుచుం దిగుచు చాలై దుమ్మెద ల్మించె ని
చ్చలపుం జాయలతావిజాజివిరి సేజాజోడు నైకొన్న క్రొం
దలుకుం బచ్చలమేడ దాపు జలయంత్రంబో యనం గంటివే. 120

మ. సరసాళుల్ నిజగంధమానుచుఁ జరించంగుం బిసీజాతము
ల్వారసం జుట్టుఁ జెలంగుచుండఁగ మహోవాలంబుకుంజాత్త్రిచేఁ
గర మొప్పార సుధాప్రభావమఘవృగ్గాలి న్విహావాతివి
స్ఫురితంబై విలసిల్లె నోయబల యీపున్నాగముం జూచితే. 121

చ. అరవిరివెండిచెంబుల నయంబునఁ దేనియపానకంబు లేఁ
బరువపు గుజ్జుమావి చలిపందిరుల న్లతకూన లియ్యఁగా
నరమరఁ గ్రోలియు న్సరసిజాస్త్రిగుణస్థితిఁ గండుదేఁటి ని
బ్బరముగ బాళిమై నధరపల్లవమంటుటఁ గంటివే చెలీ. 122

చ. హితగతి నిందుబింబరుచు లింపుఘటింప మనోజకాంతసం
గతిఁదగు కైరవారముల గర్వము మించె వధూటి కంటివే
హితగతి నిందుబింబరుచు లింపుఘటింప మనోజకాంతసం
గతిఁ దగు కైరవారముల గర్వము మించుట చోద్యమే చెలీ. 123

చ. తనతను వెల్లఁ జాఁచికొని దక్షిణమారుతచోరకుండు నే
ర్పునఁ జనుడెంచి తావిఁగొనిపో వనదేవత హెచ్చరిల్లి కో
యని పెనుఁబోటుఁబోఁతలికునట్టిగతి న్వినవయ్యె వింటివే
యనుపమగాత్రి కోకిలకులాకుల కేళి కుహూకుహూధ్వనుల్. 124

గీ. మేలితేనియ నిండిన మెట్టతమ్మిఁ, జేరి కొలనాడి పుష్పాపచేరి కదు
పోసఁగ నవ్వలిక్రొవ్విరిపుటికయిల్లు, వింతగాఁ జెంచెఁ దేఁటి బాలెంత కంటె. 125

క. అనిమాలివితతకేళీ, వనపాళిఁ గరిమమోలి నన్నించుచుఁ గ్రొ
న్ననగుంపుఁ జిదుము వేడుక, జనియింపఁ గడంగి సరససల్లాపములన్. 126




ఆతివరో చూచితె యలరెడి మావులు—జతగూడిన వివె చల్లనితావులు
ఏలికపోవలి వె యిటు రారాదటె—యేలపోయె దన నింతనె వాదటె
చాలుచాలు నీసంపెగ మొల్లను—బాలకంటివే పాదిరిమొల్లను
నెలఁత రాఁగదే నిమ్మల నీడకు—వలుక నేలనే యంతటిప్రోడకు
ఎగిరి పడఁబడతే యీకంకేళికిఁ—జిగురుచాలదే చెలి నీకేళికి
నాసలేటికే యంపని పోఁకడ—వేసటలే కీవిగులనె పోఁకడ
పడఁతి రాదు నాపాలిటి పొన్నకు—ముడివిడెరోసము మొన్నటిచిన్నకు
వాసంతికకై వచ్చెను చిన్నది—దోసమొనఁగని తొయ్యలి నవ్వకు.
యీవిరవాదుల కేటికి ముచ్చట—తావులవిరికే తేటి సుకను విచ్చట
నెఱసిన వివికంటివె వాసంతులు—యొఱుకలేద నీకేటికి దంతులు
పోవలిన వచ్చటిపుష్పాపచితిన్నెలు—అదిగైకొనిరే యప్పుడె కన్నెలు
తెలఁన దాఁటితే తేనియకాల్వలు—వెఱనిరి నేఁడీవిచ్చకుఁ జెల్వలు
సరసను మొలచెను జాలుగ మొల్లలు—దొరసెడు నచ్చటఁ దుమ్మెదపిల్లలు
బొండుమల్లెలివె పొలఁతిరో మెచ్చితె—పండలు కడువింతలుగా గ్రుచ్చితె
పలుకకు కోయిలపదువులు మూగెడు—బోలఁతి వెఱచితే పూఁబొద లోఁగెడు
వెలఁది చూడు కురువింపలయంపము—కెలఁకులఁ గడుఁ దొలఁగించె మరందము
సురపొన్నల కీసున వెన్నాడకు—తరుణి వెఱకు నిత్తడి నన్నాడకు
కోవిదారములకును వాదేటికి—నేవఁగయ్యముల కేగెదు మాటికి
వనితలు బడలిన వగకనిపించెను—గొనకొని తుమ్మెదకోపము లుంచెను. 127

వ. అని పుష్పాపచయంబు గావించి చాలించినంత. 128

క. మధురిమధురీణసవిధవి, వినమాధవికాప్రసూనవిస్ఫురమరం
దధునీమిథోవిహృతిమ, న్మధుపపథాళింపమందమారుత మొందెన్. 129

ఉ. మానవతుల్లనుంగొని రమందమరందనవారవింవబృం
దానుసరన్మిళింపనికరాంధుకబంధురగంధసాంద్రమం

దానిలమత్త సింధురవిహారవిలోలతరంగజాలడో
లానిశఖేలనాకలితహంసము నొక్కసరోవతంసమున్. 130

వ. ఇత్తెఱంగునం గనుంగొని జలమానవకుమారు లెమ్మెలకై చిమ్మ క్రొమ్మెఱుంగుజము దాడుల బెక్కునం దళుక్కన నెగురునిడువాలువాలుగుపిల్లలకై నికటతటతరు పటలశాఖాశిఖానికరంబులనుండి దుముకు లకుముకులగరుత్తులం బెనఁగు మరుత్తులం దోఁచు సరాగంబు లగుపరాగంబు లందగిలి యరవిందమందిరకుం దార్చినగందవొడియబ్బెట్టైలచందంబున నీరు రుచ్ఛలితరథాంగంబు లగుతరంగంబులసందున నదభ్రవిభ్రమంబునం దిరుగుజలభ్రమంబులం దగిలి నిగనిగనికెంపురాలు నింపిన గోముగను వామవగుంటలం దలపించుటకు శిరఃకంపనంబు సేయుచు జలబిందుసందోహకందళితచిత్రశతపత్రపత్రసమావేల్లితం బగుహల్లకంబు వారిదేవత కెత్తుమరకతపాత్ర మౌక్తికారాత్రికంబుల డంబువిడంబింప నందులకు సోబనలువాఁడు ముత్తైదువుల చెలువున మ్రోయు తేఁటినీటుకత్తియల తేటపాటలకుం జొక్కనోయన నాయకులతోడిపాలయలుకలం దొలంగి చని వనజకుడుంగంబులం గపటనిద్రాముద్రితలై చలితజలాంబులికలు సోఁకిన నులికిపడి యనునయింపం బతు లేతెంచి రని బయలుజంకించు నీటుకత్తియల తేటపాటలకుం జొక్కనోయన నాయకులతోడి పాలయలుకలం దొలంగిచని వనజకుడుంగంబులం గపటనిద్రాముద్రితలై చలితజలాంబులికలుసోఁకిన నులికిపడియనునయింపం బతు లేతెంచిరని బయలు జంకించు జక్కవమించుబోఁడుల యలఘుబహుతరాక్షేపంబుల పెల్లునకుం గొల్లన నవ్వుచుఁ బువ్వింటిసాది మవ్వంపుపనిగేరు మారుతమానవునకుం దీరసంచారిశిఖావళకుమారికాకేకారావంబు లను గద్దింపులం జళుకు వోడమించి నడదిద్దునెడం బర్విన రజంబువిధంబున దుమారంబుగా నుప్పరం బెగయు పుప్పొడి పేరింట నుల్లసిల్లు నుల్లవనీడలవీడుజోడాడు వేడుకలఁ గమలినీకమలబంధుపాణిగ్రహణంబునకుఁ గులదేవతల నెదురుకొనుచదురున లజ్జించుచు పుటసమంచితసకోరకబిసాగ్రపాలిక లగుచు వచ్చు మరాలికాబాలికలకలకలంబుల సంగ్రమ్మికొని తమ్మిమేడలెక్కి పెక్కువగల జేకుచిక్కొన్నులసందునం దొంగిచూచు మధుపస్థానరోధ వధూమణుల మిథస్స్పర్ధకల కోలాహలబాహుళ్యంబులకుం దగవు లూహించుచు నాళీకముకుళంబులను కలశకులంబులం బరికల్పించి నిస్తారసంపదం గలహంసదంపతులు ప్రథమసమాగమంబునం బుణ్యాహం బాచరించి యెదురు నూడం బొడసూపిన యజ్ఞాతప్రభాతం బగు నిశాసమయంబు విధంబునం దనరు పరిసరతమాలచ్ఛాయాంధకారంబునకుం దిగులువ

డి యప్పటప్పటికి వికసితాంబుజంబులు గనుంగొని యవియు ముకుళింపమిం బొం ను రథాంగకామినుల వినోదంబులకు ఖేదమోదంబు లనుభవించుచుఁ జెంగటఁ జె లంగు చెంగలువమాలపై నంకించిపాడుచెక్కుల తేఁటిజక్కులవారియాలాపంబుల లకుం బరిఫుల్లసరోజం బనుకామిన్నిచేయవఁ బడఁగు విగళితప్రసవపరాగపరంపర యనుపరిక్రముగ్గుల దిగ్గఱ నంపం బగుమందమరుదాందోళితేందీవరముపైనుండి శివ మాడు సారసవరారోహలకు సమీపంబున శైవాలకలాపంబు లనుధూపంబులర్పిం చుచు మూఁగికొని యాగామికార్యంబు లడుగునమ్ములక్కలచందంబునం బొసంగు నానావిధజలవిహంగమాంగనావ్యూహంబున కుత్సాహంబుఁ బొందుచుఁ గమలాక రాభిధానంబుగానం గంకణవిరాజమానంబై పుష్కరస్వరూపంబు గావున రాజహం సకలాపంబై శోభితరంగవిశాలంబు గావున శైలూషప్రముఖానుకూలంబై సారం గవిలసితంబు గావునఁ బుష్కరేణుభూషితంబై యొసంగుటకు నంతరంగంబున నా నంద మందుచుం జేరి. 131

సీ. వారు మీకును నొక్కవయసువారలు గాన నువిద వారికి మీకు నుద్ది యనుచు
నొడ్డినదానిపై నొడిసిన నేలికసానిపాదములపై నాన యనుచు
నాజతతోడ నేకాంతమాడితివి మాగుంపులో నీవుండఁ గూడ దనుచు
నంటెమి గాక మర్యాదతో నిచ్చనే యప్పటికైనయట్లగు నటంచు
బాలములనాఁడు నామీఁద నొలపెట్టి, తిచ్చనిఁకమీఁదఁ జరియింపుమీ యటంచు
నందు కేమాయెఁ గాని లేవమ్మ యనుచుఁ, బలికికొంచును దెగలుగాఁ బంచికొనుచు.

మ. మెలఁతల్ తుమ్మెదకంటుకమ్మవిరిదుప్పీ పాముపామూమ మా
టలతబ్బిబ్బుల కుల్కికీలుజడఁ గొట్టం బూను జేజేలయొ
జ్జలయిల్లాలని వ్రాసినట్టి వలువ ల్చాలించి యచ్చంపు ని
చ్చలపుంజందురుకావి పావడలు మించన్ ఖేలనాలోలలై 133

గీ. డాసి దరి నిల్చి వారినీడలు పొసంగ, నీటిలోఁ దమ్మిమేడల నీటు రోసి
తన్ముఖాంభోజముల నిల్వఁ దలఁచి వచ్చు, పద్మ తాల్చిన విశ్వరూపము లనంగ. 134

చ. సుదతులు బంతిగాఁ గొలనుఁ జొచ్చిచనంగఁ గ్రమక్రమంబునం
బదములు మించి పెందొడలఁ బైకొని పొక్కిట నాఁగి చక్రసం
పదలు సహింపలేని కుచభారము లొఁగొని కంఠదఘ్నమై
తుది నటు మించవయ్యె నలతోయము కంబులు నాఁగమించుటన్. 135

మ. కొల నయ్యింతులు సొచ్చినం దరగసోఁకుల్ హెచ్చిన స్వేదుఁ ద

మ్ములపైఁ దేఁటులు వేయుతామరలపై మూఁగం దదీయాళిచే
ఖలు వాటింగదుమంగఁ బధ్వనికి రేఁగం జక్కన ల్దాఁటు చె
క్కులఁ జేఁ దెమ్మెరపుష్పాళుల్ చపలనాఁగం జిత్రమయ్యె న్వడిన్. 136.

చ. చెలువ యొకర్తు క్రొంజిలుకఁ జెందొవ బిట్టెగరంగ నైవ న
య్యలరు తపాజలిం బకుట యద్భుత మయ్యె మదీయపక్షరే
ఖలఁ జెలరేగి గాసియనఁగాఁ దగునే యని యొసఁ జెంచి చే
తులఁ బయి వ్రాలి వేఁడికొను తోయజబాంధవబింబమో యనన్. 137

గీ. సారసుచ శైలమక్షితకాసారజలధి, నప్పసప్పుడు వోనము నజ్జారికరణి
నొకశుకాలాపమించి వెల్లకిల నీఁద, నవురె ముద్దులుగాఱు చిన్నారి మోము. 138

చ. ఎలమి నొకర్తు వెల్లకిల నీఁదఁగఁ జుట్టును గల్వమొగ్గల
గ్గలముగ మించెఁ జన్నుఁగవ కాంతులు గన్గొన నచ్చెరంబుగా
జ్జలరుహగంధి పంపఁ బరిచారిక లచ్చట ముద్దుగాఁగ బొం
దులుగని నైచు గూటములతోడి కడానిగుడారము ల్బలెన్. 139

గీ. మొగము మాత్రంబు కానరా ముద్దుగుమ్మ
యొకతె నిలువీఁత యాఁడెఁ జెన్నొందెఁ గురులు
నీటి జాకరమునను మున్నిటిలోఁ గృ
పీటములు గ్రోలు మేఘంబు పిల్లయనఁగ. 140

క. బోఁటిగిల నీఁదు నొక్కమి, ఁటారి విశంకటకటితటంబొప్పారెన్
సారతరాపరపారా, వారావృత మైనభూమివలయం బనఁగన్. 141

గీ. బాలికలు మేలి జీనువరాలనూడి, నీటిక్రై జారు సౌరు వర్ణింపఁదగియె
నలమ బాలసపై నవరంటు నేయు, నలుగువిలుకాని నునుదోనియమ్ములనఁగ. 142

సీ. చనుఁగవమీఁది చందనము చెందినచోటు వెలిదమ్మిపుష్పాడు గలసికొనఁగ
మెడల కుంకుమపన్ను మించి మునిగినచోటు చెంగల్వవిరిసంపు జేరికొనఁగ
సారమానుదుటి కస్తూరి మీఁటినచోటు తేఁటిలేజవరాండ్రు మాటికొనఁగఁ
నెమ్మినిఁ బసుపువన్నియలు పన్నినచోటు నవకంపుటకరులు నాఁచికొనఁగఁ
జెంవ లీకెతి నీరాడి కొలను వెడలి, తమముఖాంభోజముల నిండు తావి గ్రోలఁ
దేనియలు గ్రాయు కచ్చికితేఁటులనఁగ, జలజకణములఁ గీలుగంటులు నెలంగ.

చ. తటమహిఁ జేరి యంతట మదాలసమం గయి సేసి తాము న
త్కటమణి భూషణావళులు దాలిచి యేటిపరాకులన్నియు

న్కుటిలకచాశిఖామణికిఁ గోసియిమ్ము రమాకుమారు నె
క్కటిభజియింపకున్న నిది కార్యముగాదని యేగి యవ్వలన్. 144

ఉ. చెలువగు పూఁబొదన్ వలపు చల్లెడు కస్తురి తిన్నె యందుఁ గెం
దలిరుపరంగిపీఁట పయిఁ దామరతూఁకునఁ జెంతనున్న నె
చ్చెలి మొగమోరసేయ రతి చెక్కులు నొక్కుచు మోవి యానుచున్
గలరవ మిచ్చు పచ్చవిలుకాని లిఖించి సఖీశిఖామణుల్. 145

చ. అలిగిన మ్రొక్కి చుక్కజవరా లదలించుచుఁ గాలఁ దన్నినం
బులకలు దాల్చు చందురుని పొంకముఁ వ్రాసి వసంతు మత్తకో
కిలములఁ దేఁటులం జిలుకగేస్తులఁ దెమ్మెరయాకతాయలన్
నిలిపి యమర్చి తెచ్చిన వనీకుసుమంబులు కుప్పవోయుచున్. 146

క. పూజించి చిలుక ముష్కి, తేజీదారఁ గూర్చి వికచదీర్ఘాగ్రంగా
రాజీవ నవమసుప్రవ, రాజీవరవై ఖరీపరంపరదొరయన్. 147

మ. హిమరుగ్బాంధవ మంత్రహీనము క్రియాహీనంబు సద్భక్తిహీ
నము మత్కల్పితమైన యీనిఖిలనానానూనపూజావిధా
నము సంపూర్ణముగాఁ దలంచి దయనానందింపు నీవంటి దై
వము చిత్తంబున మెచ్చినం గలుగలేవా మన్మనోభీష్టముల్. 148

గీ. అరయ హరునంతవాఁడు త్వద్గురుశరాగ్ర, దళితపురపర్వతుండై మహాదరముతోడ
నజ్జశరపాళిఁ గని మూళి నావహించు, ననిన నీశౌర్యసార మేమనఁగవచ్చు. 149

క. దైవం బనిన న్నినే, దైవము గాకింక నొకఁడు ధవళాక్షుల నా
శీవిషవిశిఖ శిఖార్తులఁ, గావింప న్వరులఁ గూర్పఁగా నెవ్వఁడిఁకన్. 150

సీ. వేఁడి యోఁగదవయ్య విహితశైత్యాంధ్యమంథరగంధవాహస్తనంధయంబు
వాఁడి యోఁగదనయ్య వనజాతిసహజాతి మార్దవనవకౌసుమవ్రజంబు
చేఁదుచూపుఁ గదయ్య జితసుధామాధురీసారకీరారావగౌరవంబు
వింతసేయుఁ గదయ్య సంతతాత్యంతపోషితహంసకాంతానిషేవణంబు
కామినీకాముకులకు యోగప్రసక్తి, దక్షుమగునీకటాక్షము దప్పెనేని
గాన నిను గొల్చువారిదే కౌశలంబు, భవజయోన్నిద్రతారణ పంచబాణ. 151

సీ. వీటిఁబుచ్చవె దాసవిభుకన్యఁ గను బరాశరమౌనివరుసదాచారగరిమ
బైటవైనవె బృహస్పతిభార్యఁ గనుఁగొన్న తారకాకామినీధవునిగుట్టు
నగడుసేయవె యహల్యాకాంతఁ జూచిన యమరలోకాధినాయకుని నవత

కొవ వొనర్పవె కూర్మికూఁతు నీక్షించి యుబ్బినపద్మసంభవు పెద్దతనము
భావభవ యమ్మచెల్లగా నీవుచేత, నేజఁ బట్టిన నెవ్వారు నిలుచువారు
మారమణి నింతయేఁచిన యాబుతధ్వ, జేంద్రుఁ జెనకంగఁ జాల వదేమొకాని. 152

క. మారామపట్ల నీసుప, మారాజచ్ఛరము దాఁపుమా రాజ యిదే
మారాటమునకు నోర్వను, మారాజముఖీమణీకుమారా మారా. 153

క. అని మగువ యపుడు మగుడం, బనివడి పొగడె న్మధాంధపాంథజిగీషా
తనుతత్పరంగ హేషా, ఘనతరఘోషాప్తి యొవపఁగాఁ గలఁగుటయున్. 154

శా. చీనాచక్కెర ఖాణపుంబులుఁగుఁ దేజీజోదు కేవంగి బ
ల్సానాకత్తికిఁ దత్తరిల్లి నవలా సాయంసమారంభవే
లానాలీకిని లీల సొమ్మసిల బాలాపాలికల్ చంద్రకాం
తానర్ఘాంతికవేదిఁ జేర్చి బహుచింతాకంపితస్వాంతులై. 155

సీ. మదనుగుణధ్వనికిఁ బొవలెదు తేఁటులే మంచకకింకను ఝంకరించఁ దొడఁగె
మానసప్రేమ యేమఱని రాయంచలే మించికొంకక హుంకరించఁ దొడఁగె
సహకారవృత్తిచే జరగు రాచిల్కలే కొంచకక్కడ వెక్కిరించఁ దొడఁగె
ఘనమైత్రిచే నెమ్మిగను నెమ్మిగుంపులే ధృతియింకఁగా హుంకరించఁ దొడఁగె
నేమిచేయుదుమే బోఁటి యింక నేటి, మాటలే పోటుమదనకు మగువమీఁద
నింతపగయేల బాలవాఁడేమి చేయు, మనలపాపంబు పొలియింప ననుచు మఱియు.

ఉ. కొమ్మ చిగుళ్లు దెమ్మ లతకూన విరుల్గొనిరమ్మ పద్మినీ
తమ్ములు గొంచురమ్మ వనితామణికి న్ననశీతలోపచా
రమ్మొనరించకున్న నలరాయని రాయిడి నేమి పుట్టునో
యమ్మకచెల్ల యింకఁ దడయం బనిలే దని సంభ్రమంబునన్. 157

సీ. అడుగునఁ బద్దైచిరని పళ్లం బెత్తునో నెత్తమ్మి పడముల నిలుపనేల
యంకంబునకుఁ దార్చిరని పొరవిచ్చునో యనఁటు లూపుల చెంత నునుపనేల
యధరభూమిని నిల్పిరని మొనచూపునో చిగురాకు కెమ్మోవిఁ జేర్పనేల
యంబకమ్ముల నుంచిరని యెత్తివాయునో హల్లకంబత్తుల నలమనేల
యిచట సమస్తుసంయోగమేల యమ్మ, యిదియుఁ బగవూనె నేని నీయిగురుఁబోణి
తాళలేదమ్మ మీనేర్పు చాలునమ్మ, తరుణియివి యెల్లమదనసాధనములమ్మ. 156

క. అనుచుఁ బెనఁగొన్న శత్తక, మునఁ దగు శిశిరోపచారములు చేయుటయుఁ
మనసిజశిఖి బగ్గురుమన, నెనరునఁ దల్పఖులుగుండె నెగ్గునఁగన్. 158

సీ. తనులతవిూఁద జివ్వనినిఁకి మిహికాంబుకాండ మెంతయు నిరాకార మయ్యె
నఃచేతిపైఁ జూఱచుఱ స్రుక్కియుండదఁ గెందమ్మి పుష్కరాకృతి వహించెఁ
గలికి కన్నులమీఁదఁ గమలిన పరువంపు ననగుత్తు లరయ సూనంబు లయ్యె
మినుకుఁ జందోయిపైఁ దునిసి మౌక్తికరాశి తిలకింప ముత్తెంపు తెరలుపూనె
బళిర యివియెల్లఁ దమపాటు దలఁప కిప్పు, డంగజాగ్నికి సాహాయ్య మాచరించి
కొమ్మపై వేఁడి చూపె నాకమ్మవింటి, యెమ్మెకానికే విజయకాలము సుమ్మ. 158
గీ. అదియుఁ గాకిందుఁ జనుదెంచునపుడు తమ్మి, విరుల దగుకమ్మదెమ్మెరల్ వీచెనమ్మ
గైకొనక వచ్చినంతయుఁ గంటిమమ్మ, యబలనిం దుండనీయరా దమ్మయనుచు. 160
క. ఇందీవరలోచన లిం, దిందిరకచ సేవ దేర్చి తెచ్చిరి సుషమా
కంపలితైందవరుచిగరి, మందిరమగుధవళవసనమందిరమునకున్. 161
గీ. ఇట్లు చెలువలుదోడ్కొని యేగుదేర, నంబుజాననతనగుడారంబుఁ జేరె
ననిన జైమినిముని యావిహంగములన, నంతర కథావిధం బెట్టిదని యడిగిన. 162
శా. లక్ష్మీశోపమ వీరవేంకటనృపాలశ్రీమహారాయ ద
త్తక్ష్మామండల మండనాయిత యశోదామాభిరామాఁశునీ
రక్ష్మానతఱన కార్త్తికీకుముదినీప్రాణేశ చారుప్రకా
శక్ష్మాలత్రపతిపక్షభూమిపతియోషాలోచనాంభోరుహా. 163
క. ధాటీఘోటీఖురఖుర, కోటీపాటితవిరోధికుతలపతిశిరః
కోటీరహారశకలవ, ధూటీనవమదన విభవధూర్వహసదనా. 164

పంచచామరము.

వదావదాహిభోగిరత్న వర్ణవర్ణితక్షమాం, గదాగదాసిమద్విరోధిఖండనాత్తలోకస
మ్మదా మదావళారివిక్రమస్ఫురద్యశఃకలా, పదాపదానవద్రులోకపారిజాతవైభవా.




ఇది శ్రీమన్మదనగోపాలకటాక్షవీక్షణాసమాసాదిత సరసకవితావైభవ సవరమన్వయా
భరణ నారాయణభూపాలతనూభవ శఠగోపతాపసేంద్రచరణారవింద సంచలన్మా
ససమిళింద సంతతభారతభాగవతాదిశ్రవణానంద కామినీమనోహర రూపరేఖావిజి
తచైత్రకాశ్యపగోత్రపవిత్ర జాతివార్త్తాకవిజనామోదసంధాయక చిననారాయణనా
యకప్రణీతంబైనకువలయాశ్వచరిత్రంబనుమహాప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము.



శ్రీరస్తు.

# కువలయాశ్వచరిత్రము.

## చతుర్థాశ్వాసము.

---

క. శ్రీరాజద్వేంకటగిరి, శౌరిపదాంభోజభజనజనితోజ్జ్వలతో
దారవిభవేంద్ర సవరము, నారాయణభూపచంద్రనయగుణసాంద్రా. 1

గీ. అవధరింపుము జైమిని కలపతంగ, కులపతంగంబు లిట్లని తెలుపఁ దొడఁగె
నమ్మహాలస పటకుటీరంబుదారి, కమ్మతావులతెమ్మెరల్గమ్మదారి. 2

క. వనిసొచ్చుట మరునకున, ర్పన లిచ్చుట సొమ్ముసిల్లి సఖియలవలనం
గనువిచ్చుట వారచటికిఁ, జనుదెంచుట యెఱుఁగలేక తన్మయదశచేన్. 3

సీ. మనవులు విన్నవించిన వినునోయంచుఁ జేయుకన్నియమిన్న చిన్నఁబోవ
ననబంతి కానుకిచ్చినఁ జూచునోయంచు నచ్చునెచ్చెలి తలవంచికొనఁగఁ
నెనయుతో హెచ్చరించినఁ బల్కునోయంచుఁ గదియు పైపలి సిగ్గుగాంచి యొదుగ
గసిపించి జాతిచెప్పిన నవ్వునోయంచు నరుదెంచుహరిణాక్షి యవలి కరుగ
వినక చూడక పలుకక వేదనాప్తి, నవ్యకాపద్మనయన కాంతవశరాగ్ని
తప్తకిసలయముక్తనూతనపునఃప్ర, వాళకృతశయ్యఁ బొరలాడు వేళయందు. 4

ఉ. ఈవనజాయతాక్షిఁ దరుణేక్షుధనుష్కతురుష్కమాలి యా
హా వెతవెట్టెనంచు హృదయార్ద్రిదయాభ్యుదయాప్తి చేత రా
జీవశరప్రహారగతిఁ జెందుట తెల్పఁగ నేగె నాఁగ నం
గావిభుఁ జేరెఁ గింశుకనఖద్యుతిఁ జొత్తిలి మిత్రుఁ డయ్యెడన్. 5

శా. ఛాయాప్రాగవకర్షణంబు సరసీజాతాంతభోగంబు కా
లాయానీకపతంగపాకపితృజాలప్రాప్తి పాంథప్రజా
స్థేయస్థానగతిప్రబోధకము దూతిప్రార్థనారూఢజా
రాయత్నంబు జరన్మహాతప ముదారంబయ్యె నంతంతటన్. 6

చ. వడి నపరాద్రిఁ జెంద నని వాసిగఁ బద్మిని నెత్తిమీఁదఁ జే
యిడి కరసంగతి న్నమయమేగఁ దదాశఁ గుఱించి రాగమే
ర్పడఁగఁ జనంగఁ దేజమెడఁ బాయఁడె యీయినుఁ డంచుఁ బ్రోఁత పె
ల్లడరఁగఁ జాటుచూటి సరసాళిరుతు ల్మొఱసెం గొలంకులన్. 7

చ. అవిరళనిర్గళన్మధురసాగ్రనిబద్ధ నిజానుబింబకై
తనయుని హేళి కాలవశత న్నిజపద్మగృహంబుఁ జేర మా
ధవపద మాటచే రమ మదభ్రమరాళితమంబు వాసి వెం
దవులక యుండఁగాఁ దలుపుదార్చె ననన్ముకుళించెఁ బద్మముల్. 8

ఉ. ఏకరథాంగభావము సహించిన నన్నిటు డించి పోవుట
ల్లీకుచితంబు గాదయిన నీవలె నేనును నీరధిప్రవే
శాకలనంబు గాంతు ననునాకృతి భానుని దేఱఁచూచుచుం
గోకము బాష్పవార్ధి సమకొల్పె భవిష్యవియోగఖిన్నమై. 9

ఉ. ఎంతయు బాడబంబు తనయింటికడం జెలువొందు జీవనం
బంతయుఁ గొల్లలాడ భువనావనశాలివి నీవుపేక్ష గ
న్నింతువె యంచుఁ బాళి మొఱ వెట్టగఁ జక్రము దానిపై రమా
కాంతుఁడు నైచెనో యన వికర్తనుఁ డయ్యెడఁ గ్రుంకె వార్ధిలోన్. 10

చ. కరముల బల్మిచే మెఱయు కంజహితుం డను మేటిజెట్టితో
నరుసమగఁ బోరిపోరి సమయప్రతిమల్లకులేంద్రుఁ డాతనిన్
హరువుగఁ ద్రోచి మేనిచెమటూరఁగఁ దాల్చిన యెఱ్ఱచుట్టి నాఁ
గరమమరెం బ్రవాళరుచిగంధసుబంధురసాంధ్యరాగముల్. 11

సీ. రవిగ్రుంక ముకుళించు రాజీవములఁ బాసి గమిగూడు తుమ్మెదకదుపనంగ
విభునిఁ గానక భూమి వెదకనేతెంచి చొప్పడు చాయ విశ్వరూపం బనంగఁ
దొగనంటు సోమాఖ్య నెగడి రాఁగలఁడంచు గుమిగొన్న తామసగుణ మనంగ
చేకొమ్ము పతిరాక కైకొన్న ఘుటికజుంపఁ గొనవిప్పు కురులడాల్గుంపనంగ
కాముకాగమనప్రతీక్షాపరాయ, ణోత్పలాక్షీజనాంజనవ్యూఢవిస్మ
రాయతాక్షీణనవవీక్షణౌఘమనఁగఁ, దండిచీఁకటితండంబు మెండుకొనియె. 12

సీ. నటదుగ్రఘకాలనినాదభిన్నాంతరిక్షమునఁ దాల్చిన వెండి కట్లనంగ
జనమందమందగంధవహాప్తి మింటిపై రాలు వేలుప్రమాని పూలనంగ
యామినీవిధువివాహమున కంబరవేది వరలు ముత్తెపురంగవల్లు లనఁగఁ
దమపుష్కరాభిఖ్యతథ్యాంబకా వియత్పథము చెందిన వెల్లవమ్ములనఁగ
సమయమనుయాత్ర నాళీకసార్వభౌముఁ, డంబుజంబులఁ జెందురోలంబపఙ్క్తి
యనుతుపాకిని గగనలక్ష్యంబు నైవఁ, దగులు సీసంపుగుండ్లనాఁ దార లమరె. 13

క. అలపానుపుగట్టు నగరు, న్వెలునదు రాజునకు మ్రోల వేళాసతి మె

చ్చలుచ్చుఁ బట్టివైచిన, వెలిపావడ యనఁగఁ దూర్పు వెలుఁగం బౌలెన్. 15

సీ. తనభానుసంతతి ధరమీఁద వెలయింప భువిఁగాధిపతి గురుస్ఫురణఁ బెంప
రహిఁ బావమహిమచే జాతినాతి నొనర్ప నభవోగ్రధర్మ మొప్పారఁ జేయ
మానిత ధరణిజానంద మొనరింపఁ బాంథరామాత్మదర్పంబు లడఁప
వనభూరికమలవర్గస్ఫూర్తి మాయింపఁ దారేశరూఢివర్ధన మొనర్పఁ
జేసె రాయనిగర్వంబు గాచుపింప, సమధిక పలాశపరచక్రసమితి నొంచ
నమితకువలయపరిపాలనము నమెలఁగఁ, దూర్పుదెస రామచంద్రుఁడు తోఁచెనపుడు.

. ప్రాగ్దిశాంగన కెంగేలఁ బట్టినట్టి, పురుతకాల్పట్టుగవిసెన పాముపు వలన
నంద మొందిన నిద్దంపుటద్దమనఁగ, బొడుపుఁగెంపున జాబిల్లి పొడిచె నపుడు. 17

చ. అమలిన శుక్లపక్షమెనయంవగు తద్విజరాజు మించిభే
దము సవరించి తేర్చు తెలితల్కులపాలనఁ బాంథదేహపాం
డిమబలెఁ జంద్రిక ల్నిగిడె డించిన నీరనఁ గాముకాత్మమో
హమువలె నంధకారనిపహం బది యెక్కడనో యడంగఁగన్. 18

క. ఆకరణిఁ బొలుచు హృదయ, వ్యాకులతాతాపకారి యగు శోకారిం
జేకూరిన వగ వేఁపు, రాకూరిమి పట్టి యుంభ్రరంబుగఁ బలికెన్. 19

మ. నెనరొందం ద్విజరాజుగా యితఁడు పోనీ యంచు నే నూరకుం
డిన నీ వెంచక యేతువే యిటులఁ గానీ మంచిదే చంద్ర నా
నుమవాలుంజడ చిల్వరాయనికి నిన్నుఁ స్మేఁతగావింతురా
వినురా యేటిపరాకురా కుసుమధన్విం గూడి వే రాకురా. 20

గీ. అమృతరామకమంటలు హారిణకృత్తి, కాసమన్వితు నుద్దండ కరుని నిన్నుఁ
గన్న సన్న్యాసిగతి దోఁచుచున్నదరయ, గగనమధ్యాభియుక్తి నీకగునె చంద్ర.

గీ. శరధిఁదోఁచుట నాళీకపరవిధంబు, గోరికాంచుటయును ద్రోయగుణముగల్గు
వింటనంటుట మమ్మేఁచుచుంట తెలిసె, నేయువారలఁ గానమోతోయజారి 22

క. నళినాప్తువలన మండల, కలితుఁడవై వెలయుటెల్లఁ గలిగిన కరణిం
దలఁతువె శంబరహారికిఁ, గలదే యుపకారమెందుఁ గమలకులారీ. 23

సీ. నినుఁ గడుపారఁ గాంచినవారిరాశికిఁ గడలేనిపాటులు గాంచవలసె
నిను నారికోరి కైకొను కల్వచెల్వకు విషములో బ్రతుకుఁ గావింపవలసె
నినుఁ దలమీఁదఁ దాల్చిన శూలపాణికి నవిభవోపేతుఁడై యమరవలసె
నిను నమ్మి కొల్చి నిల్చిన తారకాళికిఁ జింతింప దుఃఖంబు చెందవలసె

నెవ్వరికి మంచివాఁడ విల్లెంచి చూడ, నించువిలుకాని కొక్కనికే మొకాని
వానిప్రథమాస్త్రి విభవంబువారి కొనవె, రాదు నీచెల్మి చేయఁ దారాసహాయ. 24

గీ. పాంథమదఖండనోద్దండపక్షకాండ, గర్వసాహాయ్యకలయొందు గన్న నీకు
సమరభోజ్యకళ్గలచంద్రుఁ లోకు, లొకటికిఁ బదాఱు గల్పించి యుత్పలాప్త. 25

గీ. అనుచు రామాలలామ పాంథాతిభీమ, ధామచయసీమ యగుచంద్రమామఁ గినిసి
వినిశితాంభోజనారాచమెనసి యేఁచు, మనసిజు గుఱించికొనుచు నిట్లనుచుఁ బలికె.

గీ. అబ్జవైరి నీతండ్రి దైనగరుడ, గమనకేళికిఁ గుండెలోఁగాల మింత
కొదవలే నీదుతల్లికిఁ గొంప చెఱుపు, వీసితోఁగూడి యేఁచకు విషమబాణ. 27

చ. కమలశరా నినుం జెఱపఁగా నియమించినఁ జేరిమూఁడుగా
ళ్ళముసలి కావునం బయలలాట విలోచనకేలి నిన్ను ని
క్కముగఁ గరంచితుండె ననికాదె గిరీంద్రకుమారికాసరుం
డమలినమంత్రపక్షసవనావని నాతనిఁ బాఱఁ ద్రోలుటల్. 28

సీ. భామానిరూఢి గన్పడ మండలాగ్రంబు మెఱయించు మొదట నీమేనమామ
కొమ్మలపైఁ బండ్లుకొఱికి లావులనల్లభాటి కన్పించు నీఘోటకంబు
కాంతాళిపైఁ బరాగస్ఫూర్తిఁ గల్పించి చెనకంగఁ జూచు నీచికిలితూపు
నారులమ్రోఁత నానందించి నిలువెల్లఁ గన్నులు దాల్చు నీకార్ముకంబు
బళిబళీనీకు బాకైన తలిరుటాకు, లడవి లతకూనలన్నఁ బైనంటి నిలుచు
నీవు మామీఁద శౌర్యంబు నెఱపుటరుదె, మానినీప్రాణచోర రమాకుమార. 29

చ. వనజకృపాణ చల్లనయినర్తిలఁగాఁ దడిపాఁతఁ గొంతు గో
సినగతిఁ దప్పివాలు గొని చిమ్మెదు పాంథులమీఁదఁ దేనెఁబూ
సిన పెనుఁగత్తి కావలయుఁ జేతికి నీకది విప్రయోగమొం
దినయల ముద్దియం బగిలి నెయ్యముఁ జూపఁగ నెట్టులోర్చితో. 30

గీ. అనుచుఁ జెల్వపుఁ జెంగల్వయరిదికిరుసు, దురుసుమాష్టిని బవరి యియ్యురుసుపట్టి
గురుసుమద్యోతనునిదూఱిగరుసుమీఱి, పేరెములువారెడు మరుత్కుమారు ననియె.

సీ. మొదలపై నిదలేక పడగలు చిదిసిపో మేదిని భారమై మెఱయుఁ గాత
గట్టిగా నూపిరికట్టు పట్టంగ నాళీకనాభుఁడు పన్వళించుఁ గాత
నాభీలపాతాలమైనను జొరఁబాఱి పిల్చి తార్క్ష్యుండు నొప్పించుఁ గాతఁ
గ్రూరియైన భాష్యఫక్కికయందు నొకమాట తగుచుట్టుఁ బ్రోవమై తాఁకుఁ గాత
ప్రబలపన్నగకులరాజ్యపట్టభద్రుఁ, డెన్న పసపీఁడ నొకప్రక్క నిన్ను మెసవి

లేఁడు పొమ్మని యనకున్న వాఁడు గాన, దళితపాంథవిహార శీతలసమీర. 32

క. కదుఁ దాత్పర్యము నాపై, నిడుతామరసాక్షితోడి యీ నెయ్యంబు
న్విడు కారింపకు మదిఁ, జెందెడుతాలిమి నొక్కవిడుత తెమ్మెరబుడుతా. 33

గీ. అనుచు నిక్కాంత వలవంతఁ బొంచి పేఁడి, దొరలఁజెందిన కమ్మ దెమ్మెరల దూఱి
ముమ్మరమ్మగు తాపమ్ము గ్రమ్మఁ దమ్మి, సానుపున సొమ్మసిల్లుచు మేను సేర్చ. 34

ఉ. ఏను మనంబులోనఁ జెలు లింప అలంతలఁ జెందిరంచు
నప్పానుపునందు నిక్కలికి ప్రక్కనె యుంచుక పన్వలించు న
చ్చోనిఁక నేమి తెల్పుదు యశోధన కోలలఁ గొట్టి లేపిన
స్మై నెఱుఁగంగనీ కొపవె నిద్దుర యిద్దురవస్థకై వెసన్. 35

ఉ. అంతట మేలుకాంచి నయనాబ్జము లొయ్యన విచ్చిచూడ ని
క్కాంతయు నేను నిక్కధరగహ్వరపట్టనరాజగేహసౌ
ధాంతమునందు నుంటిమి మహాత్మక యిప్పుడిదేమొ యంచు మే
మెంతయుఁ జింత వంత గుఱియింప భయంపడి యున్న గ్రక్కునన్. 36

క. పాతాళకేతుఁ డంట యొక, దైతేయుఁడు చేరవచ్చిపంభోళిహటా
త్పాతాద్రిభీకహారిణీ, రీతింపగు మమ్ముఁ జూచి కృతహాసముతోన్. 37

క. లోకములన్నియు నన్నుం, గైకొనిపూజించు మీరుగామీరానా
శీకాంబకుఁ బూజించితి, రాకామినులార నాకరం బెఱుఁగరొకో. 38

గీ. ఇప్పుడేమయ్యె నింక నాయించువింటి, వాఁడనుఁగు నేఁడు గూర్చి మీవాంఛదీర్చ
నేర్చునో నేరడో చూచి నెఱఁతలార, యింపుపసలార నన్నుఁ బూజింపుఁడనుచు.

క. ఒక హెగ్గడి దానవనా, యకుతో నేమేమొ తెలిపి యాతఁడు వికట
భ్రుకుటీపటుతరనిటల, ప్రకటీకృతరోషుఁడై సభాస్థలికరుగన్. 40

క. ఆవచ్చిన చెలి నాతో, నేనగల ఋతధ్వజేంద్రుఁ డితనిం జంపం
గావిడిసినాఁడు బ్రదికితి, రీవేళకుఁ దాఁటుఁ డనుచు నేగెన్వేగన్. 41

గీ. నాఁటనుండియు వలవంత నాట నీవ, ధూటి పడుపాటు కనుచు దోధూయమాన
మానసాంభోజనై యున్న దాననయ్య, యనఘ నాపేరు కుండల యండ్రు సురలు.

వ. మహాత్మా! యిది మదీయవృత్తాంతంబు దురంతసంతాపచింతాపరాయత్తం బగు
చిత్తంబు వివరింప భవత్కథాకథనంబున కడ్డంబుగా నింతయును విన్నవించితి నీయప
రాధంబునకుం బ్రార్థనారంజకంబగు నంజలిరచియించెద నాఁడు ఋతధ్వజవసుంధ
రాపురంధరు దారుణం జూచుటం జేసి నిర్ధారణాసామర్థ్యంబు లేమిం జేసి డోలా

యమానమానసనై యున్నదానఁగాని నీయందలి సౌందర్యగాంభీర్యాదిగుణంబులు సోయం ప్రత్యభిజ్ఞావిధాయకంబులై యున్నయవి. అయినను మద్విలోచనచకోరికా చంద్రబింబంబగు నీమూర్తియుం బోలె యుష్మద్వృత్తాంతంబుఁ గూడ మన్మనః కమలంబునకు మార్తాండమండలంబుగా నానతీయ నవధరింపుము.

చ. అన విని యాజనాననగుణావని యావనితాశిరోమణిం
గనుఁగొని యింత నేర్పరివి గాక యుండిన నీవధూటి కిం
పెనయ వయస్య వౌదువె భళీయిటు వచ్చెను రాక్షసాధముం
డనుచు ఋతధ్వజుం డనవుడున్ భవదూహకుఁ దప్పు గల్గునే. 44

క. నాళీకరతో నీక, న్యాకాంక్షిత మెల్ల సఫల మయ్యెం ద్రివిష
ద్భీకరుఁ డీదనుజుఁడు ఘో, రాకారతఁ గూలె మచ్ఛరావళిచేతన్. 45

గీ. అదియు నెఱుఁగుదు వింక నేణాంకవదన, మంజువాణియు నేను నీమాటలోని
వారమైతిమి మాకు నేదారి నడువ, వలయునో యట్లు నడిపింపు పలుకులేల. 46

చ. అనవుడు నమ్మదాలస ముఖాబ్జమునం జిఱునవ్వువెన్నెలల్
నునుఁ జనుఁదోయిపైఁ బులకలున్ నిటలంబున ఘర్మబిందువుల్
మనమున సిగ్గుఁ గన్నుఁగొనలం బ్రవహించు ముదశ్రుపూరముల్
కనఁబడ నున్నఁ జూచి చెలికత్తియ యత్తఱి రాజచంద్రుతోన్. 47

చ. ఇపుడు గదా మదాళి పయి నెత్తిన వింటిపయిం జెలంగు నం
దపువిరివమ్మి తూఁపు దెసనా దొరకేల్ రతి నిబ్బరంపు సి
బ్బెపు వలిగబ్బిగుబ్బకవపై జెరలాడఁ దొడంగె నేఁడు మా
తపము ఫలించె నింక వసుధావర తామస మేటికియ్యెడన్. 48

సీ. వేఁడి నెగళ్లలో వ్రేల్చు సాకిరిసైన యప్పుడు గాని కేలంటరాదు
ప్రామిన్కులో పలు గన్పడఁ గంటెకట్టునప్పుడుగాని గళ యుక్తిఁ బొందరాదు
పొలుపుగా వ్రేలిమి బొట్టుమరించునప్పుడుగాని ముంగురుల్ పొదువరాదు
మొకమోర సేయ సన్నికలు మెట్టించునప్పుడుగాని పాదాప్తిఁ బొరయరాదు
నృపదంపతులకు విడెమిచ్చుమోవ, మెనయునప్పుడుగాని పాన్పెక్కరాదు
నీవెఱుంగవె శాస్త్రోక్తి నిర్ణయంబు, చారము లుదారకుంభినీజంభవైరి. 49

ఉ. ఏను వచింప నీవు వినుటిప్పుడ కా యిఁక మీఁద నీసరో
జానన యొక్కవేళఁ బొలయల్కఁ బరాకున నున్న యప్పుడే
మౌనముఁ బిల్లు పెద్దతనముం గనినప్పటికైన నీసుపా

దానతి నాకుఁ బోఁటియయి యప్పుడె యప్పని నేర్పఁగుందు నే. 50

సీ. రాచిల్క రాయబారమున దారికిరాక చడ్డింపు కోరమీసములు దువ్వి
యదిగా పనుచు నింతటంతటఁ జేరరాఁ గేడింపబిట్టుగాఁ గేకసైచి
నీ బంట నన్న మన్నించవే యన విని వినమి సేయుచు దుంటవిల్లు వంచి
దుడుకుగాఁ జెఱగంట ముడిగొన్న బొమ్మలానించి చూచిన తెగనిండఁ దీసి
యతనుఁ డీయింతికలుకఁ జల్లార్చ నీవు, పాపముల ప్రాల దీనబాష్పములు చూచి
యస్త్రసన్న్యాస మొనరించు నట్లుగాఁగ, నింపుసొంపారఁగా విహరింపుఁడింక.

గీ. అనిన మునిమంది యమ్మందరాద్రి ధీరుఁ, డావధూటులఁ దోడ్కొని యాత్మపురికి
నరుగుటయ కాని లేదు కార్యం బటంచు, నగవుదైవాఱఁ గుండలమొగము చూచి.

క. మంచిది మనపురిఁ జేరుద, మంచు న్లేచుటయు నవ్వయస్యయుఁ గమ్మల్
మించుగ నసియాడఁగ బదుఁ, డంచుం జేఁజూపి మందహాసముతోడన్. 53

చ. చెలువుని వెంటఁబోఁ దరుపు సేయు మనోజ్ఞము మాట చెల్లనీ
కలమెకు లజ్జకన్న ఘనమైన కటీతటి ప్రేఁగున న్నడ
ల్బైకఁగ నంచబిత్తరినలె న్మరిపంబున నమ్మదాలసా
జలరుహగంధి రా నృపతిచంద్రుని వెంబడి మేన డగ్గినన్. 54

మ. అతఁ డచ్చోఁ దురగంబు నెక్కి హృదయాబ్జాపూర్ణమోదార్ణవాం
చితుఁడై వారల వెన్క నుంచుకొని యత్యశ్చైక్యమాణిక్య దీ
ధితిజాతాన్వితదిగ్వితాన మగుడైతేయాధినాథాయతా
యతనం బల్లన నిర్గమించి పురబాహ్యక్షోణి కేతెంచుచున్. 55

ఉ. అచ్చట నున్న సైన్యము బలాధిపతుల్ వెనువెంట రా సము
ద్యచ్చటులార్భటిం గువలయాశ్వుఁడు ఢోయని చాటుచేసినన్
ప్రోచ్చలితావనీరజము లొక్క మొగంబుగఁ బిక్కటిల్లనై
యచ్చరవీథిఁ గప్ప నది యాత్మపురాంగణసీమఁ జేరినన్. 56

గీ. అచటి కెదురుగ వచ్చు ధరాధిపతులు, కామినీయుక్తుఁడై చేరఁ గ్రమ మెఱింగి
దవ్వులనె నిల్వ నిజమణిధామ మొంది, రమణులును దాను సంతఃపురమున కరిగె.

ఉ. అంతట నాసురాంతకుని యర్మిలితమ్ముఁడు తాళకేతుఁ డ
త్యంతమహాగుహాముఖకహాకహనాదమహాట్టహాసవి
భ్రాంతసమీకశోకపరిపాకభయాకరకైకలోకదు
ర్దాంతవిరక్తవోదరసదాశ్రితకేశవుఁ డొక్కయిమ్మునన్. 58

చ. కొలువునుండి యింద్రుకడకు న్మన మంపినవాఁడువచ్చినా
పిలువు మటన్న వేత్రధరబృందము తోకొని తెచ్చి మంగల
న్నిలిపిన వాఁడు భీతియు వినీతియుఁ దోఁప దురాపకోపచా
పలమున హుంకరించు నిజభర్తకుఁ గేలు మొగిడ్చి యిట్లనున్. 59

క. దేవర ప్రతాపగరిమకు, నేవెఱతుం గాని నిర్జరేంద్రుఁడు వెఱవం
డావంతయైన నిపుడే, మోవింతలుపుట్టె దనుజమూర్ధన్యమణీ. 60

సీ. దొరకాపులై కావ్యసరణిఁ దెల్పెడి కవీశ్వరులకు లంచపంచంబు లొసఁగి
సమ్ముఖమ్మననుండి చనుదెంచు నల్రాయసమువారి కాళ్ళపాళ్లు ఘటించి
బోనవెచ్చము గొంచుఁబోవు శచీదేవిదాదులకును బరిధాన మిచ్చి
పిలువ నేతెంచు వేగులవారి వెంటనే యరుగు నియోగుల ననుసరించి
కినిసి వాకిటివా రడ్డగించుకతన, నేనువచ్చినమాట దేవేంద్రుతోడఁ
దెలుపు మని యెంత వేఁడినఁ దెలుపరైరె, విని వినమి చేసెనో కాని వేల్పుఱేఁడు. 61

క. మనగురు నఁట నేవచ్చుట, వినెనేమో గుడ్డికంటి వేలుపుదొరతో
వినిపించి యతనియనుమతి, నను గొని చని సమ్ముఖమ్మున న్నిలుపుటయున్. 62

సీ. ననుఁ గని పాట నిల్పినతుంబురుని జూచి యాతఁన మీసాది యనుమటంచుఁ
గమలజోద్భవ సుమాళిము చెందినాఁడవు వింతవార్తలు గలవే యటంచు
నీతని నంపరాదే యంచు సన్నగాఁ దెల్పువారలను గద్దించుకొనుచుఁ
గ్రేఁగంటఁ బల్కనుంకించు నగ్నని పట్టుఁగద్దిగ లెస్సాయెగా యటంచు
సడ్డ సేయక నిరుపమైశ్వర్యగర్వ, పటిమపవఁతులు జలకంబు పట్టియున్న
దనఁగఁ గట్టికవారింద్దకనిపికొంచ, యంచఱు నటుం మఱ్రేమాయ నయ్యాసనమున.

గీ. మనగురుఁడు చేరి ననుఁ జూపి మనవి గాఁగ
నితని వీడ్కొల్పఁ డన్న దేవేంద్రుఁ డొద్ద
నున్న గీష్పతిఁ గని కనుసన్న సేయ
నతఁడు నాదిక్కుఁ జూచి యనాదరమున. 64

క. ఏమోయి తాళకేతుం, డేమని పంపించె నిర్జరేంద్రుని కడకు
ద్దామక్షేమాహంతసాం, గ్రామికుఁ డాతనికి శుభమె కదయనిపలుకన్. 65

గీ. చఱచఱను జూచి దొరనిన్నుఁ జూచువాఁడు, నంతలోన నె నీవు నన్నడుగువాఁడ
వాబలా పొట్టిక్రొవ్వుగాకంచు నేను, గోత్రపరిపంథితోఁ గొంకుకొసరు లేక. 66

క. తారారంభలు చక్కఁగ, వారనఁగా మెచ్చి దనుజవల్లభుఁడు నినుం

బేసుకొని వేఁడుమన్నాఁ, డారమణుల నొప్పగింపు మటుగాకున్నన్. 67

సీ. అలవాటు చేసికొమ్మఖిలమరుత్ప్లవములఁ గూడికొని నిల్వఁగొల్వఁగను
నభ్యసింపఁగఁ జేయు మలజయంతునకు వేళ యెఱింగి వెండికాళాచి దాల్ప
దారికిఁ దెచ్చుకొమ్మ్మరూఢిఁ బౌలోమి సైరంధ్రికాసదాచారమునకు
నలవడఁగా నేర్పు మచ్చరలకు మాఱునలుకరి బొనిసపాటులకును
దలఁపకమృతంబు వైజయంతంబు మఱవు, విడువు వజ్రాయుధముతోడిగొడవ యింక
నిచటనుండక వెడలి రమ్మిపుడు దేవ, పట్టనం బేను దోరణకట్టినాఁడ. 68

క. అని నీల్గు నన్నుఁ దప్పకఁ, గనుఁగొనలం గొప్పనిప్పుకలు కుప్పలుగాఁ
గనుఁగొనుప్రథమకుప్పితిఁ, గని దేవగురుండు రోషకలుషేక్షణుఁడై 69

క. ఓరీ మీదొర గోరిన, తారారంభలవిటావతంసులచేతన్
మీరజనీచరుఁ డగ్రజుఁ, జేరంజనుఁగాక యని వచించుచు నలుకన్. 70

గీ. వీనివెడలంగఁ ద్రోయుఁడి వీట్టికోట, దాఁటునందాఁక ననుమాట నోటనుండ
నీటు వోమీటి గరువంబు మాటి యిటకుఁ, బెద్దపర్వాన వచ్చితి పెసరువుట్టి. 71

క. ధారాధరవాహన గ, ర్వారూఢియు గురునిశాప మటులుండెఁ గదా
మీరజనీచరుఁ డగ్రజుఁ, జేరం జనుగాక యనుటఁ జెందితి వగలన్. 72

క. పాతాళకేతుఁ డాదృష, దైతేయుఁడు వీఁడు దమ్మదాలసకొఱకై
యేతెఱఁగున నేమయ్యెనొ, కో తెలియ దటంచుఁ దెలిసికొను నట్టియెడన్. 73

గీ. అరితిఘుటిల్లఁ గొందఱు చారవరులు, వచ్చినతిసల్పి కువలయాశ్వక్షితీంద్రు
చేతనైనట్టి పాతాళకేతు పాటు, తోఁపఁదెల్పినఁ దాళకేతుండు కనలి. 74

చ. ఒదవినశోక మాచికొని యుగ్రతరాగ్రహకేళికావశం
వదుఁడయి యింద్రు గెల్చుటకు వచ్చిననే మటుమీఁదఁగాదె నేఁ
డదయత నన్నరేంద్రుఁడు మదాలసకై కద భాసమానదో
ర్మదుని మదగ్రజుం బిలుకుమార్చను దాని హరింతు నిత్తఱిన్. 75

గీ. కపటమునఁ దెత్తునాహంసగమన నదియె, ఱింగి మార్కొన్న నాతని భంగపఱతుఁ
బగయడంపక యున్న నీపగిది నెగులు, సైఁచవచ్చునె యిదియ నిశ్చయ మటంచు.

సీ. ఎదురిండ్లు ఘలుసాల లెనసివర్ణింపఁజాలిన మేలిపణ్ణశాలికలు కొన్ని
యాగమాతంబుల యందలి యర్థము ప్రకటించు కీరశారికలుఁ గొన్ని
హవిరన్నసంభ్రమద్ద్విజకోలాహలాంకములైన యాగవాటములు కొన్ని
దున్ని విత్తకపుట్టి యెన్నుల వ్రేఁగున వ్రాలు నివ్వరిప్రాలచేలు కొన్ని

తోఁపు లోఁకకొన్ని తెలినీటిదోనలు కొన్ని, కొలఁకు లోఁకకొన్ని పెంపుడుపులులుకొన్ని
మొసవు లోఁకకొన్ని చేమంతి పొదలుకొన్ని, బెరయఁగఁ దపోవనంబుఁ గల్పించి యపుడు
గీ. తోడిదైత్యులు శిష్యులై కూడి నడువఁ, బేరు ముండవ్రుఁ డనుచుఁ గల్పించుకొనుచు
గొన్నిమాయలు మదిలోన నెన్నికొనుచుఁ, గువలయాశ్వుని పట్టణ క్షోణిఁజేరె. 78.

ఉ. అంతట పౌరసారసదళాక్షు లుదారవిహారసౌధయూ
ధాంతము లెక్కి కంటి రటవమ్మ మునీశ్వరుఁ డొక్కఁ డిమ్మహీ
కాంతునిఁ జేరి రాక్షసనికాయము చేత మదీయయజ్ఞమా
ద్యంతముఁ గోలు పోయితి నయా యని శోకనిపాతచందముల్. 79.

ఉ. నిన్నఁ గదమ్మ గాలవమునిప్రభు వెంబడి నేగి రక్కసు
న్వన్ని యమార్చి రాచిలుకవంటి మదాలసఁ దెచ్చి యుద్వహా
భ్యున్నతిఁ గోరి నేఁటికి ముహూర్త మటంచును నిశ్చయించె నీ
యన్నిక చిన్నవోవఁగ ఋషీశ్వరుఁ డెక్కడవచ్చె నక్కటా. 80

సీ. తలవాంచి బెళుకుఁ జూపులు క్రేగ్లుతుఱ్ఱంగఁ దెరమొఱంగుననిల్చు సొరపుఁజూచి
చెలికత్తె చేమెచ్చవలెనన్న సిగ్గుతోఁ దలఁ ద్రాలువోయు చిత్తరముఁ జూచి
వ్రేలిమిఁ జెమరించు కీలనంటెడు లాజ లందిచ్చునట్టి సోయగముఁ జూచి
కులదేవతకు మ్రొక్కు కొనువేళఁ దనపేరు వలుకఁ గొంకెడు ముద్దుబాగుఁ జూచి
ముచ్చటలు దీర్చుపూనిక వచ్చియితనిఁ, దోడుకొనిపోవుచున్నాఁడు దుడుకుఁదపసి
యతని మాటకు మారాడఁ డయ్యె యీతఁ, డిందుముఖి రాజులకు సౌఖ్యమేడదమ్మ

క. దొర నయ్యెదనని [illegible]ము, రరయగ జను లెవ్వరైన నాపెనుబెడ ద
ల్పరికింపరు దొరతనపు, న్సరవు ల్మతికత్తిమీఁది సాములు సుమ్మీ. 82

సీ. మంత్రుల మర్మకర్మము లెఱింగెడు దారి కోటలు కాపాడుకొనెడు నేర్పు
తటికాపు చెడకుండ సరిగోరుకొనుకీర్తి యీతిబాధలు చెందనీని సొంపు
పరులయాలోచన ల్పరికించు గరిమంబు నర్థార్జనముమీఁది యాదరంబు
వేఁటతోఁటలమీఁద విలసిల్లు నాసక్తి యొడ్డోలగంబుండు నొప్పిదంబు
తగిలిపిరువీఁకు సేయ నుద్దండవృత్తిఁ, జెలఁగుటయె కాని మనసు వచ్చినమిటారిఁ
గూడితమిమీఱ సయ్యాటలాడికొనుచు, నడువఁ గూడునె మేదినీనాయకులకు. 83

క. అని యాడికొనఁగ మాయా, ముని వెంబడిఁ గువలయాశ్వమున్నాకిరయం
బునఁ జని యారాకొనుచుఁడు, గనియెం బత్సర్ణశాలికాప్రాంగణమున్. 84

గీ. అంత నమ్మాయతపసి యయ్యాధిపపర్యఁ, గమ్మవమ్ములఁ దుస్మెవదిన్ముఁదోలి

మనస్సరపుఁ బుష్పవృష్టి నెమ్మిఁ గురియించి, తెమ్మెరలు గ్రమ్మఁ గమలాకరమ్ముఁ జేర్చి
గీ. అధిప నీవింక వచ్చిన యపుడె తొలఁగి, రక్కసులమాయ పద్మాకరంబునందు
వరుణజపమొనరించి యేనవ్వు వనుక, నిధట సుందరంగవలయు నీవేమి యనక. 85
గీ. అయ్య నినునమ్మఁ గూడ దేనరుగు దేరఁ, దామసంభైన జరగెన వేమొ నీవు
కాకయుండిన నిమ్ము నీకంఠహార, మిప్పు డన చిన్ని నవ్వగ్రోనిచ్చుటయును. 86
క. జలదేవతకుం బ్రాంజలి, సలుపుచు నక్కలన మునిఁగి జనపతినగర
స్థలమున నంతిపురంబున, నలరం బోవచెంత డిగ్గియుండేలుటయున్. 87
గీ. కుండలియుఁ దానునవ్వుచుఁ గూడియున్న, యమ్మసాలసఁ గని మంత్రియంద మొంది
యమ్మనురాజు మానిమూగమ్ముగాచె, రక్కసులఁ దోలి భుజబలప్రాభవమున. 88
ఉ. అమ్మని యంత సంతసము నంది యవిందితకార్యధుర్య రూ
ఢమ్ముగ నీవివాహముచటుం జరగింపఁగఁ గోర్కె వేడ్క యా
యిమ్మనఁ బట్టనంబు రచియించెవనాదు తపోబలంబుచం
గొమ్మను బిల్వ బంపు మిటకు న్మఱుమాటలు పల్క కేమియున్. 89
గీ. అనిన మాటాప వెఱచి యమ్మనుజనాథుఁ, డానవాలుగ నీకంఠహార మిచ్చి
నిన్ను వేవేగఁ దోడి తెమ్మన్న నచ్చి, నాఁడ రావమ్మ కుండలతోడఁ గూడి. 90
మ. అనియామౌక్తికహార మిచ్చుటయు సాంద్రానందమున్ బొంది మా
నిని మేకోలునఁ గుండలానవనము న్వీక్షింప నయ్యంబుజా
నన కానిమ్మని పల్కఁ గృత్రిమవిమానం బెక్కఁగాఁ జేసి య
ద్దనుజాధీశుఁడు తానదృశ్యుఁడయి చెంతంబోయి సంతుష్టుఁడై 91
వ. అత్తఱిం దటిత్తరుణభానువిరాజమానం బగు నమ్మాయావిమానంబు జలయంత్రంబును
పమఁ బ్రవేశంబునకుం గమకించునంపకంబురకంబునఁ బోవవుగా నెగిరి యొక్క
పరిరథంబువిధంబున మంపగతిం జనుచు నొక్కసారి లకోరిద్ధారి రివ్వున నిగుడు
చు నొక్కతేప బొంగరంబు రంగున బిఱబిఱం దిరుగుచు నొక్కమాఱు గాలిప
టంబునీటున ననియాడుచు నొక్కయెడఁ జుక్కతెగిపడ్డ విధంబున డిగ్గుచు నొ
క్కచోటం బుట్టచెండు వడువున నుప్పరంబునకుం బోవుచు నొక్కవంక జీనుది
గదైచిన కప్పలి చొప్పునఁ గదలక నిల్చుచు నొక్కపరిభైరిడేగ యొయారంబునం ది
ర్యక్ప్రచారంబుఁ జూపుచుఁ బోయి మేరుధారుణీధరంబున నిబిడాంధకారబంధు
రం బగు నొక్కబిలంబున దమాలతాలతక్కోలరసాలసాల ముఖసాలవిశాలం బగు
వనంబునం బునఃపునర్వర్ధమాన గిరిఝరీవితానంబులకు నుబ్బగన్పించు పస్నీటిపి ల్ల

కాలువలవలం బ్రోదిసేయు జాదివిరిదేనియవాఁకవెంబడిం బోయుకొనిన పోఁకబ్రాకు
లకట్టకడపటనెట్టుకొనిన యిందుకాంతవేదికాబృందంబులతోడి గురివిందపందిళ్ళ
నొరసికొనియున్న తిన్నని మాగిపూతివన్నియలఁ జెన్నగు చివికల సమూడుకొన్న క
న్నెసుపొన్నగున్నలఁ బెనఁగొన్న నతిబియసజాతికి నాధారంబగు గొప్పకెంపులు
బ్బచప్పరంబులం గప్పికొన గుజ్జుమావులక్రేవలఁ దమ్మితావులకుం దావులైన తెలి
నీటి కేళాకూళినంటికొనిన యనంటులవలనం దొరఁగు కప్పురంపు రసలం బాఱు
కొలువుకూటంబు డిగ్గిచను మెట్లసగ్గల నగ్గలంబగు నీలంబు నిగ్గులు గగ్గోలుపడు కో
నపాదిరింగొఁగిలించిన పొగడగుంపుల నట్టనడుమఁ బట్టుగఁ బొదరిండ్లఁ జుట్టఁబ
డియున్న బిత్తరం బగు క్రొత్తకుత్తియంపు బదుకటింట నపరంజిగొలుసులం జెలం
గు తూఁగుటుయ్యెలచేరువనుం జని యద్దనుజవీరుండు నిజాకారంబుతో నయ్యుద్ద
అం దగ్గృహాంబున నునిచి యతిఘోరాకారలగు దైతేయభామలం గాపువెట్టి కృత
కృత్యుసంగాఁ దలంచుకొని యాక్షణంబున. 92

చ. మునుపటిపారికాంక్షి వినయుం భజియించుచు నంబుజాకర
బునఁ బడి తేలి యోన్నృపతిపుంగవ నీభుజసారగౌరవం
బున జపమెల్లఁ దీఱెఁ బొలివోవక నీవిఁకఁ బట్టినస్థలం
బునకయి పొమ్ము రాజునకుఁ బోలునె యాశ్రమవాసఖిన్నతల్. 93

చ. అని యనుపన్ హసావని నృపాగ్రణి యమ్మునిలోకచంద్రు వీ
డ్కొని తన తేజి నెక్కి గిరికోటులుఁ గాననవాటులు న్మహా
జనపదముల్ నదంబులును జయ్యనదాఁటి పురంబుఁ జేరి కాం
చనసముదారమై తగుహజారమునం దమవారు చేరఁగన్. 94

క. తురగంబుడిగ్గి యచ్చటి, పరిజనుల న్వీడుకొల్పి పార్థివచంద్రుం
డరిఁగి గృహాంతరమునఁ ద, త్తరుణీమణి లేమి నద్భుతసమగ్నుండై. 95

ఉ. అక్కట యెందువోయెనో యుయ్యారపు సంచులముద్దుగుమ్మ యే
చక్కని దాఁగెనో కలికి చక్కనలెక్కనగుబ్బలాఁడి యే
దిక్కనున్నదో సోలపు దేఱుడిచూపుల హొంతకారి యే
యిక్కనిల్చెనో యొరపు నీనెఱు చిల్కలకొల్కి దైవమా. 96

ఉ. ఆనన లామెఱుంగుఁదొడ లాకదళంటన మాచునోయగం
బానెరు లామిటారిచెరు లామురిపంబునఁ బల్కుపాటనం
బానోస లాదెమంగంబులన లాతెలివయ్యెనదక్కఁ జేర్చుపాం

పేశలిసాక్షికైనఁ గలదే కలరే యిటువంటి కామినుల్. 97

సీ. గిలుకుబంగరుమెట్టియలు జాఱఁగాఁ జక్కనలవరించెద నంచునిలిచినిలిచి
బయట నున్నది చిల్కపంజరమున నుంచి మఱివచ్చెద నటంచు మరలి మరలి
యతివ యల్లపుడేమి యంటివే యేచిరాకయియుంటిఁ దెల్పుమం చడిగి యడిగి
చెమటచేఁ దిలకంబు చెదరెనో యని వింతసోలపుతో నద్దంబు చూచి చూచి
ప్రొద్దు గడపుట కని తోడి పూవుఁబోఁడు, లపరనైనంగఁ దనమూపయానగరిపు
యినుమడింప మదీయమోహానగృహంబుఁ, జేరు టెన్నఁడొ యానీలచికుర నికర. 98

శా. కైజాచేసినబొండుమల్లె విరిబ్ఖుగాడాజగాజోదు తే
జీజాపం దలవాంచి బోఁటిచెఱఁగుం జేఁ గట్టిగాఁ జట్టి ను
న్గాజుం గంబము చాఁటున న్నిలిచి క్రేఁగంట న్ననుంజూచు నం
భోజాతాక్షిని సెజ్జకుం దిగుచు నేర్పు ల్గల్గునే మీఁదటన్. 99

క. ఎక్కడి యాలోచన యిది, యక్కట యక్కలికి యున్నయప్పటికిఁ గదా
యిక్కోరికియని నవవి, ల్మొక్కలిదొరవిరిలకోరి మొనకుం దలఁకున్. 100

సీ. పొదఁగనవచ్చు నాప్తులవేళఁ గాపంచు నేవసరంబులవార లడ్డగింపఁ
బనిగల్గియుండినఁ దనకు మంత్రులకు లేఁజిగురుఁబోఁడులచేతఁ జీట్లు నడున
నిదియేమొ కడువింత గదయంచు నవరోధ బిసరుహాక్షులు గుసగుసలువోవఁ
గొలువుకూటమునందుఁ జెలఁగెడు సింగంపుగద్దియగవిసెన గైకొనంగ
బొక్కసంబులు పెనుబీగములు భజింప, నుడిగములవారలకు నాటవిడుపు గాఁగ
నోలమును మాని మేదినీయువతిజాని, యింతి భావించు నంతఃపురాంతరమున. 101

క. ఈకరణి నన్నృపాగ్రణి, యేకరణీయములు మాని హిమకరవిలస
ద్రాకలకు న్వలిదెమ్మెర, రాకలకుం జాలిగొని విరాళిఁ బడంగన్. 102

ఉ. ఆతని నేస్తగాండ్రు భుజగాత్మజు లవ్వగ లెల్లఁ గాంచి య
య్యో తమవంటివార లిటు లుండియు నీదొర నీ దురంతచిం
తాతనుతానితాంతహృదయవ్యథఁ గూఱఁగ నూరకున్న సం
గాతులమారమే యిపుడుగాక మఱెప్పటికి వయస్యతల్. 103

క. అని యయ్యిద్దఱుఁ జని తమ, జనకుం డగునశ్వతరుని సమ్ముఖమున న
జ్జనపాలువిరహవేదన, వినిపించి తదార్తిమాన్పవే యనివేఁడన్. 104

చ. తనయులస్నేహబాంధవవిధానము లెంచి నరేంద్రుఁ డంటిమా
ఘనుఁ డటువంటివాని కుపకార మొనర్చినఁ గీర్తి చెందదే

యని రజతాద్రికిం జని నగాత్మజతోఁ జదరంగ మాడు రు
ద్రుని గని మ్రొక్కి కుండలివరుం డటు నిల్చిన నావరంబునన్. 105

గీ. అంబికయును నితం డెవ్వఁ డనుచు నడిగి, యధిపుఁ డశ్వతరుండు గాఁడా యటన్న
నీతఁడా యశ్వతరుఁడు సంగీతవిద్య, దొడ్డవాఁడఁట యనిన రుద్రుండు చెలఁగి.

క. వెనుకం బురుహూతు దెసం, దనతంబురవలన గెలిచె నానాగతుల
న్ననతుంబురు నీ వెన్నఁడు, వినవంబురుహాక్షి నేఁడు విను మనిపలుకన్. 107

గీ. మంచిది నగటుపై నిదె మంత్రికాన, లున్న దీచదరంగ మిట్లుండనిమ్ము
వెనుక నాడుద మని సతి వనజనయన, యభిముఖంబుగఁ గూర్చున్న యవసరమున. 108

గీ. ఔర నాకోరిక ఫలియించె నంచు నెంచి, యచటఁ గూర్చుండి యయ్యురగాధినేత
గవిసెన సడల్చి తంబురకలికిపైఁడి, బిరడలు బిగించి శ్రుతులెల్ల సరిగఁ గూర్చి. 109

క. రాకాశశాంకవదన వ, రాకా యిటు నీకు మ్రోల రహిఁ గనిపింపన్
నాకుఁ దరమౌనె యైనం, గాకుండిన నీకు ముద్దు గద యని యంతన్. 110

సీ. శ్రుతి తోడఁ గూడి మెచ్చులు రాసజంబుగ సంచునంవగ నాలపించు సొంపు
గణియమైనను గుక్క విడువక హొయలుగా నవరసంబుగఁ దానము నెఱనేర్పు
పరరాగముల వింత సొరనీక వ్యాప్తిమై మించుగా రాగంబుఁ బెంచు వింత
తాళంబు తప్పక తనువు గదల్పక భావమీర పదంబు పాడుదారి
ఎడనెడఁ బరాకు వినువారు మెచ్చరింపు, మీరు మెచ్చిన యీవిద్య మీకొసంగు
నట్టిదని గర్వపరిహార మలర నతఁడు, గానవిపునశుద్ధమార్గము నటించి. 111

గీ. గోఁటి వాద్యంబు కిన్నరవీణ బద్ధి, వాద్యము రబాబు వగలు సర్వంబు మెరయ
దురుసుగతి జూపఁ బార్వతీ తరుణి మెచ్చి, జాదు సరిగంచు పయ్యంటఁ జక్కఁ జేర్చి

ఉ. ఎక్కడి నారదుండు మఱి యెక్కడి తుంబురుఁ డోగిరీశ యే
దిక్కునమైన నీవిధము తేటపడం గనుఁగొంట లేద యే
పెక్కువ తప్పకుండఁ గనిపెట్టుక యుండితి మెందుఁ గానమ
మ్మక్కళ భాసు మేలు హవుసంబు ఫణీశ్వరుఁ జూచి యింపునన్. 113

క. నరమదుగుచునిన గంగా, సరసిజముఖి యీసుతోడి జంకెన చూపుల్
బొరసిన మొగంబుఁ ద్రిప్పెం, గిరిజకు డెందమున వింత కినుక జనింపన్. 114

ఉ. అమ్మక చెల్లి యెన్ని వగ లద్దిర నాయకుఁ డొద్ద నుండఁగా
నెమ్మెలు గాక యేను నడమిచ్చెద నంటివి చేటిమాట దో
సమ్ముసుమీ నగుబాటులౌ నన్నని నాగు నవ్వులేక యే

కొమ్మని యీఁగఁ జెల్లునె యకుంఠిత చాతురి గల్గియుండినన్. 115

గీ. అని పలుక నెంత లేదామృగాక్షిమాట, వినకు మడుగుము పరమిత్త్రు విభుఁడుతనకు
నంతచనువిచ్చినాఁడన నవ్వధూటిఁ, జాలుకు చులుకునఁ బాష్పతిఁజూచెనపుడు. 116

చ. ఉరగవిభుండు లేచి కుధరోద్భవఁ గన్గొని యమ్మ మేదినీ
వరుఁడు ఋతధ్వజుండు భుజవైభవశాలి మదాలసాసతిం
బరిణయమాదునంచు నిజమందిరమం దిరవొంపఁ జేసి త
త్తరుణి వయస్యఁ గుండల వితావితఁ గావక వంతఁ గుందెడున్. 117

గీ. వారి నిష్టరి రప్పింపవలయు ననిన, గిరిజ, కానిమ్మనంగఁ దత్సరసిజాక్షి
కాని కుండల రాపంచు గంగ పలుక, నభవుడిద్దరియందు మధ్యస్థుఁ డగుచు. 118

గీ. మంచిదహిరాజ రెండునాళ్ళించుమించు, గాఁగఁ గుండల చనుదెంచు గాకయిప్పు
డమ్మదాలస వచ్చు నీవలుగుమనిన, నదియపదివేలుగా నెంచి యాతఁడడఁగె. 119

ఉ. అంతటి లోననే యలమదాలస నిద్దురవోవ నయ్యుమా
కాంతుఁడు మాయచే నురగ కన్యగృహంబున నల్పనాతఁ డ
త్యంతముసంతసించి తనయాత్మజగా నురరీకరించి య
య్యింతిని గొల్వ వెవురు మృగేక్షణల న్నియమించి యత్తరిన్. 120

చ, తనయులఁ బిల్చి మీరు వనితామణి వచ్చిన మాటఁ దెల్పక
జ్జనపతిఁ దోడితెండనఁ బ్రసాదమటంచును వారలేగి ప్ర
క్కన నుడిగంపుఁ జేడియలు కొందఱు గొల్వఁగ నున్నభూవరుం
గనిన నతండు నిండు కుతుకంబునఁ జేరున నుంచి యిట్లనున్. 121

ఉ. ఇన్ని దినంబు లంబుజవనీశుఁడు చెందొవయిండ్లలోన ర
క్కన్న మదాళిఁ బద్మగృహకోటికిఁ బొమ్మని తీవరించు నం
తన్నణుఁ జేరవత్తురుగదా యొక యామము పోవుదాక రా
కున్న తెఱుంగు మాకు విన యోగ్యము యేని వచింపుఁ డింపుగన్. 122

క. పరబల ఖండన మంత్రా, చరణమొ గృహకృత్యగత విచారమొ కాకో
పరపుత్రులార మీ, రిట కరుదేరక యుండ నాఁగినది యెయ్యదియో. 123

చ. అనుడు భుజంగరాజ సుతు లట్టివి యేవియు లేవు లెండు మా
జనకుఁడు మీగుణంబువిని సంతసమంది మిముం గనుంగొనన్
మనమునఁ గోరి తాన పయనంబయినన్ వలదా యిలాబలా
రిప దోడిఁ దెత్తుమంచు వివరించుటకై తడవుంటి మిత్తరిన్. 124

క. ఆతీరునఁ బలుకఁగరా, దో తెలియమి గాని శౌర్యధూర్వహనీసం
గాతముచే నీమన్ననఁ జేతం దొడి తేరఁ బ్రతినఁ జేసితిమనుఁడున్. 125

క. మాయురె తా రానలెనా, యాయెడకే నరుగుదెంతు నాయిల్లనఁగా
నీ యిల్లనగా వేఱా, వోయఁగ రా విట్టులైన భువి సఖ్యంబుల్. 126

మ. అనుచుం గట్టికయింతి దేవర పరాకయ్యా పరాకంచు బో
రన మ్రోయన్ వలెవాటు సుప్పటి చెరం గల్లాడఁగాఁ జేఁగటా
రిని లోభాగము నూఁది నిల్వఁదగు వారి న్నిల్పుచున్ మేలికుం
దనపుం గద్దియ డిగ్గి నిల్చె నురగేంద్రక్ష్మా దివృక్షూరతిన్. 127

చ. నిలచి పరావనీప రథి నీరథి మంథనమందరాద్రి య
బ్బలి యుఁడొకండు పాప దొరపట్టులు తెన్నెఱఁగించుచుండఁగా
నలరుచుఁ నేఁగి కాంచె సికతాంచితతీరసమేతకేతకీ
తిలకగ చంచరీక సుదతీ కృత గీతిక గోమతీనదిన్. 128

చ. కనుఁ గొని చిల్వరాచకవ గ్రక్కున నన్నదిఁ గ్రుంకఁ జేసి తో
డ్కొని చనఁ నేఁగి చూచె ఫణకోటి మణీఘృణి వేణి కోర్థ్వ దీ
పనికర భ్రాత్రపాచరిత శౌఃపకేళి విధూత రత్నరు
గ్జనిత నవస్మితానన భుజంగిక మొక్కపురంబు ముందరన్. 129

చ. అచటి వియోగిభోగి జలజాక్షులు మారునివ్రాసి కోల్చి నో
నచలితభక్తిఁ జందురిని యందమెఱుంగమి మున్ వసుంధరా
రుచి గరుణావలోకులు నరుల్ చెలి నీ మొక మబ్జునంటివన్
వచనము లంతలోఁ దలఁచి వ్రాయుదు రున్ముకురాగ్ర వీక్షులై. 130

క. ఈకరణిఁ జూచి డిగు నా, భూకాంతున కొక్కయింపుఁ బొడమించెను వ
ర్వీకర నైశాకర రు, చ్యాకర ముక్తానుషక్త హర్మ్యతలంబుల్. 131

సీ. తీవయుయ్యెల లూఁగు పూవు బోఁడులవీఁగు కొప్పుచీఁకఁటిఁ డాఁగు కోర్కెయొకటి
నును పుట్ట చెండాడు వనితల యరవీడు జిలుగుపయ్యెదఁ గూడు చెలువ మొకటి
యలయంచ నడలించు చెలుల జంకెనమించు బెళుకుచూపులముంచు బెరికి యొకటి
పూవుబంతులు రువ్వ పొలతుల తెలినవ్వు కలికి వెన్నెలగ్రొవ్వు గనుటయొకటి
గాని మఱియేమి వలదని కంకణంబు, గట్టుకొని సల్పుపతి దృష్టిగ్రమ్మరించి
చలిది గట్టించి త్రిప్పె నిస్తుల సువస్తు, నవ్యసంతోషకరమగు నాగపురము. 132

ఉ. ఇట్టులఁ జూచుచుం జను నరేశకు శేశయబాణు చూడ్కి న

న్నిటమగుడించెభోగి పరిణీ తరుణీ ఫణ ధోరణీ నవా
ఘటిత మణీగణీభవదకంప ఘృణీత వియన్నిశాంగ మో
త్కట ఝరిణీ సరోజ మతికారి నమేరు వరీర మారుతుల్. 133

క. ఆవ్వనముఁ జేరి యవ్వవు, జవ్వనవున్ రాచకొమరుఁ జల్లనిసుందుం
దువ్వరల నివ్వటిల్లెను, పువ్వుంబొదరింట నునుచి భుజగకుమారుల్. 134

క. ఇట నుండు మేము నీవ, చ్చట యురగేంద్రునకుఁ జెల్పి శోభనలీలా
ఘటనాపూర్వంబుగ ని, చ్చటి కేతెంచెద మటంచుఁ జనుటయు నతఁడున్. 135

మ. వెలుఁగుల్గాఁపగు మిన్నతీవియల కీవిన్ రాయు పన్నీటికా
ల్వల తుంపుర్లకు మారు గాఁబలెఁ జలద్వాసంతికా సూన ని
ర్మల మారందకణాళి జారి తనపై వ్రాలంగ రాయంచ తె
క్కలు ఝాడించినఁ గ్రమ్మ తెమ్మెరల రాకన్ హాయి మంచున్నెడన్. 136

చ. హడపము వీణ కిన్నెర హిమాంబువు నించిన గిండి చల్వపా
వడలుఁ గురంగనాభియు జవాదియుఁ దట్టుపునుంగు వీవనల్
ముడి విరు లద్దముల్ సురటులుం జెలిపంతపు దవ్వోల్ ముదం
బడర ధరించి యూడిగపుటబ్బురపున్ వలిగుబ్బెతల్ దగన్. 137

సీ. జిగిచాలు దగుకీలు చిగురాకునకు బ్రాఁకు కలికికోయిలలకుఁ గొలుపనుప
నెలగోవగలమోము తెలిదమ్మిఁగల తుమ్మెదలకు నమ్మిక కమ్ములలవరింప
నెఱికప్పఁగను కొప్పుఁ నెరిమబ్బునకు నుబ్బు నెమలికిఁ ద్రోవబత్త్యములనుప
నునుమోవి పైకీవి మును బింబ నికురుంబములకేఁగు రాచిల్కకొళ్ళవులియ్య
లెనగవు డాలు కైవంద పూను చూపు, తళుకుచే మ్రొక్కఁగొనెడు ముత్యాలరేట్ట
పేట పాపటబొట్టు తుంపిళ్ళు గుల్కియు, నచటికేతెంచె నొకచకోరాయతాక్షి. 138

సీ. కావలిఁగనునింతి కానుకిచ్చినబంతిఁ గనుసన్న నొకకన్నె గైకొనంగ
జెలిమాపు గమి తారసిలుచు నిల్చిన యంతఁ బడతులిద్దరు బరాబరులు సేయ
నగుమోము జిగితమ్మి నిగుడు ఘర్మము గ్రమ్మి నంతుకై చెలువపానడలు దుడువ
తొలఁగు బంగరురంగు జిలుగు పయ్యెదకొంగు సకియ యొక్కతె చక్కసవరింప
కట్టిక మిటారి మొకరి చెల్కత్తెగములఁ, బొడఁగనఁగఁ జేయు బంగారుపొంతె మొఱుఁగు
టరిగె గుంపుల నీడ నొయ్యారమొసఁగ, వచ్చి పుష్పాపచయకేళివాంఛదేలి. 139

క. మడమఁబడు నిడుదవాలిక, జడ నడుమున జుట్టిపైట సరిగె చెరంగుల్
బెడఁగుఁ జనుదోయి పొడ లే, ర్పడ బిగియించుచు ననుంగుఁ బడతులుగొల్వన్. 140

చ. చిలుకలలోన చిక్కులయి చెల్వపుటంచల లోననంచలై
తెలివిపొసంగు తీపియలఁ దీవియలై సరసంపుఁ బల్కులన్
గులుకునడల్ పసిండి తలుకుల్ గలమేనులు గానుపింపఁ జే
తుల కసివోవఁ దేనియలతో ననతోయము లెల్ల గిల్లుచున్. 141

సీ. కలిగొట్టుఁ జేరబో కళి గొట్టు సేయునీ బీరమేమిటికి జంబీరమదిగొ
సిందువారము తెనె సింధువారములేని పైరుగాఁదేఁటి కింపై రుచించుఁ
జూతము పదరమ్మ చూతము మదవతీగానంబు లచ్చోట గానరావె
రమ్మ మారుని గుడారమ్మ మారు నిజమ్మ గుంపువోటుల గుజ్జుగుంపు లేల
యీరమా యీరమానీతి యీప్రసూన, వాసనల్ వాసనల్ వంకనందికొనఁగ
పాటలాపాటలాళిచేపడియె ననుచు మాటకే మాటకేమి లేమావివిరులు. 142

క. అని జవ్వను లవ్వనిఁ గ్రొ, వ్వునఁ బువ్వులు గోసి కడు దవులొ్కను నవ్వుల్
నన రువ్వులు కొంపరు మె చ్చనిచివ్వలు నివ్వటిల్లఁ జని యవ్వలనన్. 143

సీ. కంబముల్ గాన నిల్కడఁ గన్న పోఁక బోదియలపై నడిగాగ డీటుకొన్న
యలదీన చాలు వాకిలి సొచ్చి లేమావి గుమురుల క్రీనీడఁ గొప్ప కెంపు
లలితంపు మెట్లఁ గేళాకూళికవ్వల జలయంత్రములవీఁగు బలుసగాడ్పు
గదియంగఁ గలువ మేల్కట్టు పూవుల గప్పు సాంబ్రాణి దూపంపుజలపసాళి
నరసిఁ బురివిప్పఁ జను నెమ్మి నాస గలుగు, బాని గాఁజేసికొనెడి చిత్తరువుబొమ్మ
చిలువచెలువంపు జడ గుంపు సొలపు నింప, నీఁడుగాననియొకచిన్ని మేఁడమీఁద.

క. చెలునైన పసిడిగద్దియఁ, గొలునై నలువంకఁ జెలువ గుంపులుగొలువన్.
బలువైఖరి పావడ నెల, తలు నైవఁగఁ గన్నెయున్న తజినటమున్నన్. 145

శా. ఆజన్మస్థిర ధర్మకర్మ నిపుణుం, డారాజు రాచిల్క మే
త్తైజీ జోత్తైదాక పొంతకాఁడయి తనుం ద్రిప్పంగ నయ్యాంతి య
య్యోజన్ వచ్చుట గాలెఁ బూపొదలలో నున్నట్లువీక్షించి యా
రాజీవేక్షణ వెంటనంటఁ జని గారామార సౌధస్థలిన్. 146

క. వలభిన్మణిగణగుంభిత, వలభిం దద్రుచి తమంబు వలఁగొని పొదుపన్
జలదాచ్ఛాదితుఁడగుత, మ్మలదాయ యనంగ నిలిచి ముదితం జూడన్. 147

శా. ఏకైకాంగవిలోకనాకల నతుష్టైకాంత సామంత భా
వాసూతంబులు తద్విధాత్మరచనా త్యాశ్చర్య గాఢాప్త మూ
ర్ధాకంపంబులుఁ దత్సమానకృతి మానాధీన నానావచ

